చ. అజుఁడ వమానుషుండవు న ౯ హస్కరవంశసముద్భవుంతవున్
నిజముగఁ దన్నుఁజంపుటకె ౯ నీ వవతారము నెత్తితౌఁడ వం
చు జనితబుద్ధి యయ్యు బిరు ౯ సుంధన మొప్పఁగ సీత పీడఁ డ
క్కజముగ వాఁడు పట్టుఁ విడ ౯ గా నభిమానధనుల్ ధలంతురే? 67

ఉ. పాపులఁ జంప నీవు మును ౯ పం క్తిరథాత్మజుఁ డై జనించి యా
భూపతి యాజ్ఞఁ బోయి వన ౯ భూమికి; సీత హరించినట్టి యా
పాపిఁ దరంగతుంగ మగు ౯ వారిధి సేతువుఁగట్టి వేగ లం
కాపురి కేఁగి చంపితివి ౯ జ్ఞాపక మున్నదె? లోకనాయకా! 68

ఉ. అంతటఁ బోక వాఁడు మను ౯ జాశనకాయము వీడి నవ్వవే
షాంతరమున్ నటుండు గొను ౯ నట్లు ప్రతారణనై పుణీక్రమో
దంతము సాగ, నిత్తటిని ౯ దా శిశుపాలనృపాలభూమికన్
వింతగఁ దాల్చి దాఁచి తనశ వెక్కటిపుట్టువు; నేఁడు గ్రుమ్మరున్. 69

తే. బాలకుండయ్యు చంద్రుడు ౯ వంటి మోము
మూఁడు కన్నులు నాలుగు ౯ బుజము లొంది
యువకుఁ డై నేఁడొ తేజున ౯ రవిని మించె
నిజకరాక్రాంతభూభృ త్త ౯ నెడి ప్రసిద్ధి. 70

ఉ. ఇమ్మహి దేవదానవుల ౯ కేశ యనుగ్రహ మాగ్రహంబు, ని
త్యమ్ము నొనర్పఁగా బ్రభుఁడ ౯ నాదిమదైత్యులు రావణాదిబృం
దమ్ము నిజేష్టదైవతప ౯ దంబులఁ గూర్చి బలీయులై రి వా
రెమ్మెయి నాకు నీడగుదు ౯ రే? యని నవ్వుచుఁ ద్రుళ్లఁ గ్రొవ్వునన్

మ. బలగర్వంబునఁ దొంటి పుట్టుల బలెఁ ౯ బాధించు లోకంబులన్
గెలువఁ గోరుచు వాఁడు నేఁడు నటు తా ౯ నే కాదె జన్మాంతరం
బులనేనిన్ సతియౌ పురంధ్రి పగిదిన్ ౯ బూర్వాశ్రయం బెంచి ని
శ్చల యై పొందును బూరుషున్ బ్రకృతియున్ ౯ సత్యంబుగానమ్ముమా.

శా. కానన్ బ్రహ్మకృతానుశాసనము ధి ౯ క్కారించు నీముష్కరున్
గీనాశాలయవాసిఁ జేయుటకు శం ౯ కింపంగఁ బోకయ్య య
న్యూనాభూర్జిత పక్త్రిమాపదురుబా ౯ ధ్యుల్, సాధుబాధావినో
దానందాత్మ లవధ్యులే బుధనుత ౯ వ్యాపారభూరాశికిన్. 73

కం. అరివధ మగుసేని పురం
దరుని యురము ప్రథిమ మెనయు ✽ తన్ బులకలఁ గ్రి
క్కిఱియు చనుమొనల శచి తాం
దరఁగఁ గవుఁగలించు నొత్తు ✽ నరుఁ దాఁకొనన్. 74

శా. ఈరీతిన్ ముని చెప్పి మిన్నొరసి పూ ✽ ర్ణేందుద్యుతిన్ వెల్గ నోం
కారంబున్ బ్రకటించి చైద్యు నెడ న ✽ ల్కన్ గొన్నయాశార్ఙ్గి కే
పారన్ గేతువు వక్త్రమందు గగనం ✽ బం దట్లు తోఁచెన్ మహా
వైరిప్రక్షయసూచకంబు భ్రుకుటీ ✽ వ్యాజంబునన్ జెచ్చెరన్. 75

ఇది శ్రీబుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
ద్వారకకు నారదుని రాకయు, శ్రీకృష్ణున
కింద్రసందేశకథనంబు ననెడి
ప్ర థ మా శ్వా స ము
స మా ప్త ము.

—✽—

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

## [శిశుపాలవధమహాకావ్యము].

## ద్వితీయాశ్వాసము.



### —* మంత్రాలోచనము *—

తే. "యాగ మొనరింతు నరయ ర" మ్మని పృథాసు
తుండు పిలిచెన, చైద్యుపై దండు వెడల
వలసె నిప్పుడ యని మురవైరి కలఁత
నందె నించుక కార్యద్వయంబుఁ దలఁచి. 1

తే. అసురగురు దేవగురువరు లనుగమింప
నాకసంబునఁ దోఁచు శశాంకుఁ బోలి
యుద్ధవుండును బలరాముఁ డొయ్య వెనుకొ
నంగ విచ్చేసె హరి సభా రంగమునకు. 2

తే. తివిరి జగతికి శాంతి సంధింపఁగోరి
వారు మువ్వురు మేలి సభాస్థలంబు
దివ్యమైన త్రేతాగ్నుల తేజుతోడఁ
జేరి యాసీనులై విరాజిల్లి రపుడు. 3

తే. అన్యు లెవ్వరు లేకున్న యచటి స్తంభ
రత్నముల వారి యాకృతుల్ ప్రతిఫలింప
వేలకును వేలు పురుషులు వెలసినట్లు
పరఁగె వారు కూర్చున్న సభాస్థలంబు. 4

తే. వార లాసీనులైనట్టి స్వర్ణపీఠ
ములు మృగేంద్రవిరాజిత భూమిభృత్త్రి
కూటముల సొంపుఁ దాలిచి కొమరు మీఱి
యున్నతము లౌచుఁ గనుపట్టి యున్నఁ గనె. 5

తే. అయ్యెడ విచక్షణుం డగు హరియుఁ బెద్ద
లైన యా యిర్వురం గని యపు డవశ్య
మాచరింపఁగ వలయు కార్యద్వయమునఁ
గలుగు విప్రతిషేధంబుఁ దెలియఁ బలికె. 6

—* శ్రీకృష్ణుఁడు బలరామోద్ధవులతో మంత్రాలోచనము చేయుట *—

తే. కుంద సుందరశఙ్ఖమ్ము లట్టె పక్కు దురు గల ము
కుందు నెమ్మొగమునసుండి చిందు వాణి
సభ నలుంగడఁ బొలయు నా శౌరి లేఁత
నగవునస్ఫోఁగి యుద్ధవ ఋణగ వెలింగె. 7

ఆ. మీరు పలుకఁ దగు సుదారోక్తులకును బ్ర
స్తావమాత్రమె యగు నావచనము
నాటకీయ మైన నర్బేడి పస్త్రప
సంగమునకుఁ బూర్వ రంగ మట్లు. 8

ఆ. దిగ్జయం బొనర్ప ధృతి గల సోదరు
లెల్ల రాజులను జయించి కప్ప
మిచ్చువారిఁ జేసి; రేటికి మన మేఁగ?
శమనజుండె చేయఁ జాలుఁ గ్రతువు. 9

ఆ. హితముఁ గోరువాఁడు వృద్ధి నొందు విపక్షు
నింతయైనఁ దగ దుపేక్ష సేయ
నరయఁ బెద్ద దైన వ్యాధియుఁ బెంపొందు
నరియు నొక్కరూప యనరె బుధులు? 10

తే. నాకు మేనత్త బిడ్డఁ డైన శిశుపాలుఁ
డలిగి నను నింద సేసిన నలయ నేను
జగము నీతఁడు బాధింప సైఁపలేని
వగల నొగులుచున్నాఁడఁ బగలు రేయు. 11

తే. తమదు మతము దెల్పుం డంతఁ దనుక నాదు
మతమె సమ్మతం బౌచున్న మనుననుగాత
విదితసారుండె యయి యెంత విజ్ఞుఁడయిన
నొకఁడె యైన సంశయితుఁడై యుండుఁ గాదె. 12

తే. అనుచుఁ బ్రత్యక్షరంబు న ర్థాన్వితముగఁ
పలికి మిన్నకయుండె న న్నళిననాభుఁ
డారయ నుదాత్త చరితు లౌ నట్టివారు
ప్రకృతిచేతనె హితమిత భాషులుగదః 13

తే. అంత బలదేవుఁడు విరోధి యాగడములు
విన్న మాత్రన పొడమిన కినుక మెఱయ
వల్లభాధరబింబచుం బనచణ మగు
నోష్ఠ మదరంగ నిటు పల్కె నిష్ఠురముగ. 14

తే. పెద్దవాఁ డౌట కర్తవ్య వేది యౌట
నుద్ధవుఁడు పల్కఁబో రాముఁ డొయ్య నాపి
పలికె ముందుగ నుద్ధవ వాక్యవితతి
యెల్ల నుత్తరపక్షమై యెసఁగునటుల. 15

కం. కలు ద్రావిన కైపునఁ గెం
పొలయ మెఱసి, రేవతీము ఖోచ్ఛిష్టవిని
ర్మలము లగు తెప్పలొప్పఁగఁ
దళుకొందిన కనుల ఘూర్ణి తము లొనరుచుచున్, 16

తే. కౌఁగిటికి నాస సేయు నం గన తుటారి
చన్నుఁగవ బింకమునకును సాక్షి యైన
మృదులవనమాల గర్వవి జృంభితోష్ఠ
ముఖసమీరణముల వాడి పోవుచుండ. 17

తే. సంజ కెంజాయ మెఱయు నిం గిం జెలంగు
రిక్కగమినాఁగఁబగతుని మొక్కలమ్ము
తలఁపునం బాఱ నెఱుపైన తనువునందు
స్వేదజలబిందువులు పుట్టి చిందుచుండ. 18

తే. కుండలంబులఁ గూర్చిన గొనబు కెంపు
టాకుల మిటారపుంజిగి యంసభాగ
మందుఁ దాల్చిన నీలని లాంబరములు
గున్నమామిడిచిగురుటా కుగొనర్ప 19

తే. రేవతీకాంత పుక్కిట § లో వసించు
కమ్మతావి గుబాళించు § కల్లు చెల్మిఁ
గాంచి యాత్మీయవ క్త్రాంత § రాంచిత మగు
కమ్మవలపులు నలుఁగడఁ § గ్రమ్ముకొనఁగ. 20

తే. మోముదమ్మికిఁ జెంతను § ముసురుకొనెడు
చంచరీకంబులను వెల్ల § మించు లెనయ
ధవళములఁ జేయఁగాఁజాలు § దంత పంక్తి
కాంతిఁ జిమ్మంగఁ బల్కె నీ § గతి నతండు. 21

—* బలరాముఁడు స్వాభిప్రాయముఁ జెప్పుట *—

తే. వాసుదేవుఁడు పలికెడి § పల్కు నిర్భ
యమ్ము, నిర్దోషమును, సొచు § నలరుఁ గాన
నతఁడు నుడివెడునది యేది § యైనఁ గాని
తడయకయ చేయు టొకటె యు § త్తరము దలఁప. 22

సీ. కట్టెల మోపులఁ § గాల్చు విభావసు
కంటె భాస్కరు తేజ § ఘనము కాదె?
విస్తృతం బైన వా § గ్వితతికంటె మురారి
పలు కల్పమైన ని § స్తులితశక్తి
విపులార్థబోధక § విభవంబు దనరియు
నల్పసంఖ్యాకప § దాంచితంబు
గాఁగ నాడిన వెన్ను § క్రమవాక్యములకుఁ
బలుపల్కు వే పల్కు § భాష్యమ యగుఁ

తే. గడునిపుణు లైన వారల § నుడువు లపుర
ప్రతిఘటించి వచించు వా § క్పతుల నైన
మూకుల నొనర్చు ననుకూల § ముగ వచించు
జడులనేని యొనర్చువా § క్పతురులుగను. 23

తే. ఆఱు గుణములు శక్తిత్రి § యంబు, మూఁడు
సిద్ధు లుదయత్రయం బంచుఁ § జెప్పుమాత్ర
చాలుదురు నీతిశాస్త్రపు § స్తకము లధిగ
మించి మిడిమిడి తెలివి దు § ర్మేధసాళి. 24

సీ. మదిలోనఁ గార్యంబు ౹ తుద మొదల్ చర్చింప
కుండు వాక్చూరు దై ౹ ర్యోక్తు లేల?
లక్ష్యమున్ గొట్టఁజా ౹ లని ధనుర్ధరుఁ డెంతొ
లీలకై చేయు వ ౹ ల్గితము లేల?
నయిదు స్కంధంబుల ౹ కన్యరూపాత్ముఁడౌ
యాత్ముండు లేఁడని ౹ యాడు బుద్ధ
భగవాను శిష్యుల ౹ పగిదిఁ బంచాంగంబు
కన్న మంత్రము కల్గ ౹ దవనిపతికి
తే. ననుచుఁ బల్కుదు మఱియు స ౹ ర్వాంగవృతము
నయ్యు పరభేదశంకిత ౹ మగుచు మంత్ర
మొగి చిరస్థాయి కానేర ౹ దుర్వి నరయఁ
బూర్ణరక్షితుఁ డౌ జోదు ౹ పోలిక గద. 25

తే. ఆత్మవృద్ధియు శత్రుక్ష ౹ యంబు ననెడి
రెండె సూ నీతిసార మీ ౹ రెంటి నూఁది
యేకదా నీతిశాస్త్రవి ౹ వేకయుతులు
విస్తరించిరి తమ వచో ౹ విభవ మెల్ల. 26

తే. ఎంత యున్నను దృప్తి యా ౹ వంత వల్వ
దది మహాత్ముల కొక్క దృ ౹ ష్టాంత మరయఁ
బూర్ణుఁడయ్యు సముద్రుండు ౹ భూతికాముఁ
డగుచుఁ జంద్రునిరాకచే ౹ నలరుఁ గాదె! 27

తే. స్వల్పసంపద కెవఁడేని ౹ స్వస్థుఁ డంచుఁ
దలఁచు నవ్వాని సంపద ౹ దనర దింత
వృద్ధి యెన్నఁటికిని కృత ౹ కృత్యుఁ డౌను
విధియు నని యెంచుచుండు నీ ౹ విధిని నైన. 28

సీ. పూర్ణశత్రువినాశ ౹ మును జేయకుండఁగా
మానధను లొకింత ౹ మానలేరు
గాఢాంధతమసంబుఁ ౹ గడముట్టఁ జేయక
[illegible]రవి యుండఁ గలఁడె యు ౹ ర్వరను జూడ

శత్రుసంహారంబు § సల్పకుండఁ బ్రతిష్ఠ
యబ్బునే యెవ్వారి § కైనఁ దలఁప
ధూళిని బురదగాఁ § దోఁడ్తో నొనర్పక
మానునే సలిల మెం § దేనిఁ దలఁప
తే. నొక్కఁడైనను శాత్రవు § డుండునేని
సుఖ మెటులఁ గల్గు నెందైన § సురలుచూచు
చుండ రాహువు పీడించు § చుండుఁగాదె
యమృతధాముని నిధియు ధ్వ § స్తాంత మొకటి. 29

* ఉ. మేలును బట్టి మిత్రుఁడు న § మిత్రుఁడు కీడును బట్టియైన నె
వ్వేళ స్థిరంబుగా సఖుఁడె § విద్విషుఁడే యగుటన్ గరీయుఁ డిం
కోలిని బ్రాకృతుల్ సహజు § లొక్కొక వేళల శత్రుమిత్రభా
వాల విపర్యయంబు గన § వచ్చును నమ్మఁగ రాద వారలన్. 30

సీ. అరి ప్రాకృతుండైన § యట్లుగాక సహజుఁడె
యైనను మే ల్సేయు § నేని సంధిఁ
జేయ నర్హుండౌను § స్నేహితుం డిట్టివాఁ
డపకారముల్ సేయు § నట్టిఁ డైన
వానితో సంధి నె § వ్వా రొనర్పఁగ రాదు
సంధి కర్హంబు ల § క్షణము లివియె
ప్రాగుక్తకృత్రిమ § ప్రాకృతవైరుల
యందుఁ జైద్యుం డొక్కం § డనిశఁ గాఁడె?
తే. వీని తల్లి శ్రుతశ్రవ § మేనయత్త
మనకుఁ దత్పుత్రుఁడౌట వీఁ § డవశ్య సహజ
మిత్రమే యయ్యుఁ దా బద్ధ § శత్రుఁ డగుచు
నెపుడు మన కెగ్గొనర్పుచు § నే మెలంగు. 31

---

* తే. కృత్రిముఁడె శ్రేష్ఠుఁ డారయ § మిత్రుఁడేని
వైరియే నింక సహజుఁడౌ § ప్రాకృతుఁ డటు
మిత్రుఁడె విరోధి కావచ్చు § శాత్రవుండె
సఖుఁడు గావచ్చుఁ గార్యవ § శముఁ బట్టి. అది పాఠాంతరము.

తే. తాను బెండ్లాడ నున్న యా § త్తరుణి రుక్మి
ణిని హరించి యాచైద్యునిఁ § గినియఁ జేసి
తరయ స్థిరమూలముగ వైర § తరువు నిలిచి
వెలయఁగా స్త్రీజనమె తల్లి § వేఱు సుమ్ము. 32

తే. నరకుపై దండయాత్ర నీ § వరుగఁ జూచి
మోహరించుచు నీపురి § ముట్టడించె
నినుఁడు దొలఁగంగఁ జీఁకటి § హేమశైల
తటము నలువంకఁ గ్రమ్ము చం § దమ్ము దోఁప. 33

ఆ. అల్ల బభ్రు వనెడి § యాదవు నిల్లాలిఁ
బతితుఁ డాతఁడు చెఱ § పట్టిన కథ
పలుకఁ దగునె? యిస్సి § ఖలుల సంస్మరణమ్ము
గూడఁ బాపమందుఁ § గూల్చుఁ గాదె. 34

ఆ. కీడు ముం దొనర్పఁ § గెరలు విపక్షు ను
పేక్ష చేయువాఁడు § దక్షుఁడైన
గాలి కెదురుగాఁగఁ § గక్షమ్మునం దగ్ని
నిల్పి నిద్రవోవు § నియతి వాఁడు. 35

సీ. స్వల్పాపరాధముల్ § చాల పర్యాయంబు
లైనను నొక్క మ § హాపరాధ
మొకసారి యైనను § నొనరించు నేని యా
విమతు మర్దింపంగ § వేగిరింప
కుండ క్షాంతి వహించి § యోర్వంగ వచ్చుఁగా
కనుమతుం దగు నేని § యట్లు గాక
పెక్కుసారులు రేఁగి § పెద్ద యొగ్గులఁ బూని
సలిపిన యేని యా § శతృజాల
ఆ. మింత చేయక వధి § యించుట కర్తవ్య
మగునుగాన నట్టి § యధికు నిట్టు
దెగక నెవ్వఁ దోర్చు § జగతీత్రయంబు నందు
నిదియ నీతి యని గ్ర § హింపఁ దగును. 36

చ. పరిభవవేళలందు మగ § వారికి శౌర్యము చెల్లు స్త్రీలకున్
సురతములందు సిగ్గు విడు § చొప్పున నయ్యది భూషణంబ యౌ
నిరతము తక్కువేళలను § నీరజనేత్రకు లజ్జ కైవడిన్
బురుషులకున్ క్షమాగుణమె § భూషణ మౌ నని యాలకింపమే. 37

మ. పరసంప్రాప్తమహాపమానదహన § జ్వాలావళీదగ్ధుఁ డై
ధరఁ బ్రాణాల ధరించువానికి నథోఽ § ధః పాతమే యబ్బు న
ద్దురితాత్ముండు జనింపఁడాజననిఁ జెం § దున్ గాదె సౌఖ్యంబు దు
ర్భరగర్భోద్వహనార్తియున్ బ్రసవ ఘో § రక్లేశమున్ లేక తాన్. 38

ఆ. కాలఁ దన్ను ధూళి § పైకంబ తల కెక్కు
వానిఁ గ్రిందుపఱచు § వైరి పూని
పరిభవింప నైఁచి § స్వస్థుఁ డౌ నాదేహి
యట్టి ధూళికంటె § నధముఁడె కదః 39

కం. జాతిగుణకర్మసముచిత
మై తగు నొక యర్థ మే ను § పార్జింపఁ డెవం
డాతని జాత్యాదు లగు వ
పేతార్థము డిత్థపదడ § బిత్థపదగతిన్. 40

తే. కొండయం దెత్తెకాని లోఁ § తుండ దద్ది
లోఁతెకానియున్నతి సమా § లోచనీయ
మిట్టియవిలంఘనీయతా § హేతువైన
యుభయమును నుండుధీరునం § దొకని యంద. 41

తే. అర్కచంద్రులు చేసిన § యపకృతి సమ
మైన రాహువు ఖరకరు § నప్పుడప్పుడు
శీతకిరణునిఁ దఱచు గ్ర § సించుచుండు
హేతు వేదన్న మార్దవ § మే కదన్న. 42

క. పరవాయు వల్పమేని వి
సరినంతన వంగు తృణము § సరణిని లఘు వౌ
నరుఁడు తనంతన నతుఁ డగు
సరగున దృష్టాంత మిదె యు § సారుల కెల్లన్. 43

తే. సకలతేజస్వులందుఁ దే ƒ జస్వి యెంత
దూరమున నున్న గణ్యుఁడై ƒ తోఁచుఁ బంచ
వహ్నిమధ్యతపస్వికిఁ ƒ బంచమాగ్ని
గా రవి దవీయుఁ డయ్యు లె ƒ క్క కును రాఁడె? 44

క. హేలగ నున్నత మౌ విమ
తాళితలలఁ గాలు మోప ƒ కధిరోహింపఁ
జాలునె యాకాశపద మ
నాలంబంబగుచు కీర్తి ƒ యంబుజనాభా! 45

తే. మృగము నంకమ్మునన్ ధరి ƒ యించి చంద్రుఁ
డయ్యె మృగలాంఛనుఁడుగఁ గ్రౌ ƒ ర్యమున మృగచ
యంబు చెండాడునట్టి హ ƒ ర్యక్షమే మృ
గాధిపతి యాయె నిదియె శౌ ƒ ర్యంబురూపు. 46

తే. నాలవ యుపాయమునఁ గాని ƒ కేలఁజిక్క
నట్టి పగవాని యెడ సామ ƒ మగును చేటు
చెమట లూరించి యామజ్వ ƒ రము శమిల్లఁ
జేయనౌఁగాని నీరముల్ ƒ చిలుక నౌనె? 47

చ. స్థిరగురుకోపధారి యగు ƒ చేదినృపాలునిపట్ల స్వాంతమే
దురమృదువాక్ప్రయోగ మది ƒ దోషమ యౌను గుణంబు కాదు; ని
ష్ఠురతరవహ్నికీలలఁ గ ƒ డుంగడు క్రాఁగెడి నేతిలోనఁ జె
చ్చెఱఁ గడుఁ జల్లనౌ జలముఁ ƒ జల్లినచో నెటు లౌనొ యట్లగున్. 48

తే. సంధి మున్నగు గుణముల ƒ సంప్రయోగ
మందు నౌచితి యెఱుఁగక ƒ యర్థమున క
నర్థకరులౌ నమాత్యనా ƒ మాంకితులను
బగఱ మున్ముందఁ తొలఁగింప ƒ వలయుఁ బ్రభువు. 46

కం. తన బలము పెరుఁగ నని కేఁ
గ నగు నని రొకంద్రు వైరి ƒ గతబలుఁడే నె
త్త నగు నని రొక్కరా రెం
డు నుదాసీనున్ నిసుం గ ƒ డుం బ్రేరేచెన్. 50

సీ. స్థైర్య గాంభీర్య వి ౯ స్తారసంపదఁ గాంచి
లోకోత్తరం బైన ౯ వీఁక నెసఁగి
పరు లెట్టి వారైన ౯ వారిపై లంఘించి
పరుల కోడని యట్టి ౯ పటిమఁ దనరి
ముజ్జగంబుల క్షణంౘబున రేఁగి ముంచఁగా
రయ సాహసముల క ౯ రంబు దాల్చి
యాదవాగణ్య ఘూ ౯ రాంభోధి నాపఁగాఁ
జెలియలి కట్ట నీ ౯ వలచిన క్షమ
తే. కాన నీవు తటస్థుఁడై ౯ నేస గొనెడు
జయము నీయదిగా నెంచు ౯ చతురుఁడ వయి
బుద్ధి యార్జించు భోగంబు ౯ పురుషుని దని
సాంఖ్య శాస్త్రంబు వచియించు ౯ సరణినూని. 51
తే. మిత్రుఁడైన జరాసంధ ౯ మేదినీశుఁ
డాహవంబున భీముచే హతుఁడు ౯ గాఁగఁ
గుందు శిశుపాలునకు బాప ౯ బొందు లేమి
సుదముఁడగును దాన జయము ౯ సుమ్మ నీకు. 52
తే. అనెడి పక్ష మాపద్ధర్మ ౯ మట్టిచేఁత
మానధనునకు సిగ్గున ౯ కాను పూర్ణుఁ
డగు శశివిధుంతుదున కెట్టు ౯ లట్ల వైరి
పూర్ణుఁడగునేని యుత్సవం ౯ బునకె యౌను. 53
తే. బలవిశృంఖలతన్ బయిఁ ౯ బడుట వేఱు
శాస్త్రచోదిత మగు నీతి ౯ సరణి వేఱు
కాంచఁ దేజస్వినకు నంధ ౯ కారమునకుఁ
గలుగునొక్కొ సమానాధి ౯ కరణవృత్తి. 54
కం. ఇంద్రప్రస్థమ్మునకు ను
పేంద్ర! చనక చేదిభూమి ౯ కేఁగుటయే మనకుం
ఖీంద్రముల చేరికకు నా
య్యం ద్రిమరాజములు మోఁద్రిడు ౯ లేఁగాక యటన్. 55

మ. అట మాహిష్మతిలో వసించు ప్రజ కా § హారంబులున్ నీళులున్
బటుకాష్ఠంబులునున్ దృణంబులును ద్ర § వ్యంబుల్ సహాయంబు లొ
క్కట రాకుండ నొనర్చి గోష్ఠముల ది § గ్గన్గోవులన్ గట్టి న
ల్లెటు వోకుండఁగ ముట్టడించెదర యెం § తే దక్షులై యాదవుల్. 56

ఆ. చేయుఁగాక పాండ § వేయుఁడు జన్నంబు,
నినుఁడు వెలుఁగుఁ గాక § యింద్రుఁడు దివి
నేలుఁగాక మన మ § హితుఁ గూల్త మరయంగ
నభిలషించు స్వార్థ § మఖిలజనము. 57

తే. పగలు కంతాలు ఖండింప § బయటి కుఱుకు
ర క్తధారలఁ దడిసి శ § రప్రజంబు
మిహిరకిరణాల నెఱపెక్కు § మెఱుపుఁదీవ
లట్లు వెలుఁగొందుఁగాక యా § హవమునందు. 58

తే. ఉగ్రుఁడయి యిట్టు లను హలా § యుధు పలుకులు
గోడలకుఁ దట్టి మార్మ్రోసి § కుడ్యచిత్ర
వితతి, భయపడి తద్వాక్య § విసర మనువ
దించినట్లొప్పె నాసభ § నంచితముగ. 59

తే. అంత శేషుని యవతార § మైన రాము
వీరభాషణ మాలించి § శౌరి కన్ను
సన్న మాటాడఁగా నవ § సర మొసంగె
దివిజగురుశిష్యుఁ డైన యు § ద్ధవున కర్థి. 60

ఆ. అర్థగౌరవం, బ § నౌద్ధత్యము యథార్థ
మైన భాషణము గ § దాగ్రజన్ము
నెదుట నుద్ధవుఁడు మ § హేంద్రు నాచార్యుని
సరణి మెల్ల నుడువ § సాగె నపుడు. 61

—* శ్రీకృష్ణున కుద్ధవుఁడు స్వాభిమతంబు నెఱింగించుట *—

తే. బల్లిదుండైన బలభద్రు § పలుకు మించి
యేను జెప్పఁగ శ్రేష్ఠార్థ § మెంత కలదె?
లిఖితనిర్ణీతకర్తవ్య § లేఖ్యమునకు
మించి యుండునె? వాచికం § బెంచ నెందు. 62

తే. అతనివలెె నన్ను గురువని యధికగౌర
వాదరములను మన్నింతు పద్మనాభ!
అదియు పురికొల్పు నన్ను నీ యవసరమున
నించుకంత ప్రసంగింప నంచు నెంతు. 63

తే. స్వరము లేడింటనే గాన శాస్త్ర మమిత
మై విచిత్రత్వ మొందిన యట్టి రీతిఁ
గతిపయాక్షరములనె వాఙ్మయ మనంత
మై యవాంతరభేదంబు లధిగమించు. 64

తే. అర్థసంబంధ మన్యోన్య మదుకకుండ
నిచ్చవచ్చినయటు వచియింప వచ్చుఁ
గాని యన్యోన్యసందర్భ గరిమ నెనయు
గ్రంథరీతుల నిర్మింపఁ గష్టమె కద. 65

క. అతిమృదుల మయ్యు ఘనమును
దతగుణకల్పితముఁ జిత్రితము నౌ తమభా
షితమును జిత్రితవస్త్రము
గతిఁ గుశలులు విస్తరింత్రు కంజదళాక్షా! 66

తే. తారతమ్యవిశేషవిత్తముఁడ వైన
నీయెదుట శాస్త్ర మెవ్వఁడు నేని దాను
పన్యసించుట వాని యభ్యాససుస్థి
రతకు నయ్యాది గుణనికా రంభ మగును. 67

తే. మంత్రశక్తియు, నుత్సాహ మహితశక్తి,
జిష్ణు వగు స్వామి యెటులో యార్జించుకొనఁగ
వలెను బ్రభుశక్తి జన్మించి వర్ధిలంగఁ
గారణంబు లవే యగుఁ గాదె తలఁప. 68

తే. సోపధానంబు సుస్థైర్య శోభితంబు
నైన బుద్ధిని మంచంబు గా నొనర్చు
కొనిన ధీరులు దానియందున, సతంబు
విశ్రమించుచుఁ గాంచరె వ్వేళ శ్రమము. 69

తే. బుద్ధిసూక్ష్మప్రకాండులు ǂ మలికి యట్లు
స్వల్పముగ నోఁకి కార్యకా ǂ యాంతరములు
సొచ్చెదరు మూఢులు బహుస్ప ృ ǂ శలుగ నయ్యు
నశ్మమటు, లోనఁ జొరక బా ǂ హ్యమున నుంద్రు. 70

తే. అల్పు లల్పంపుఁబనిని జే ǂ యంగఁబూని
సగ మొనర్చియె విరమింత్రు ǂ చంచలు లయి
గొప్పపనులను దలపెట్టి ǂ కూడ నిపుణ
మతులు కలఁగరు కాంతు రీ ǂ ప్సితఫలంబు. 71

చ. వెరవులు వేయి యున్నఁ దగు ǂ వేళఁ బ్రమాదము నొందినట్టి య
న్నరు సకలార్థముల్ వెస వి ǂ నాశము నొందును వేఁటకాఁడు దా
శరములు విల్లు మున్నయిన ǂ సాధనముల్ గొని మాటు చేరి ని
ద్దరమొగ మైనచో నెటులఁ ǂ ద్రుంపఁగ నేర్చు మృగంబులన్ వనిన్.

* క. పన్నిద్దఱు రాజులలో
నున్నతి వహియించు నొక్క ǂ యుత్సాహియె, సూ
పన్నిద్దఱు సూర్యులలోఁ
బన్నుగ దినకరుఁ డొకండె ǂ పడయు నుదయమున్. 73

సీ. అవ్యాహతంబును ǂ నత్యంతదీక్ష్ణంబు
నగు బుద్ధినే శస్త్ర ǂ ముగ నొనర్చి
స్వామ్యమాత్యాదిక ǂ ప్రకృతు లంగములు నాఁ
దలఁచి లోపము లేని ǂ దారి దునిచి
మహిమ మౌ మంత్రసం ǂ వరణంబు పేరి య
భేద్య మౌ కవచంబుఁ ǂ బ్రీతిఁ దాల్చి
నిశిత దృగ్గూఢచా ǂ రిశతంబు లనియెడి
చక్షుర్విశేషము ǂ సంగ్రహించి

* క. ద్వాదశభాస్కరమండలి
లో దినకరుఁ డటు జిగీష ǂ లోఁబడి తమి ని
దాఘ్రిదుల మఱచిన నృపతియ
ద్వాదశనృపులందుఁ దగు ను ǂ దయ మెనయుటకున్. అని పా.

తే. బుద్ధిశస్త్రంబు ప్రకృతులు ƒ పొలుపుమీఱు
నంగములు మంత్రి గుప్తి య ƒ యఃకవచము
చారు లక్షులు దూత యా ƒ స్యముగ జగతి
మనుచు భూపతి పురుషసా ƒ మాన్యుఁడగునె? 74

*ఉ. ఒక్కతఱిన్ క్షమాగుణము ƒ నొందొకవేళను క్షాత్రతేజమున్
రక్కొనఁ గాలవేది యయి ƒ రాజు ప్రయోగముచేయ నౌఁజుమీ
యొక్కొక్కవేళ నోజము మ ƒ ఱొక్కయెడాటమునన్ బ్రసాద మిం
పెక్క రసజ్ఞుఁడౌ కవి గ్ర ƒ హింపఁడె యౌచితి తెగ్గ రా నటుల్.

క. పరులవలని యుపచారము
పొరసిన నవ్వికృతి బయలు ƒ పుచ్చ కసాధ్య
స్ఫురణుఁ డయి రా జెదిరి బల
మలినతతిఁ బ్రకోప మొందు ƒ వ్యాధియుఁ బోలెన్. 76

తే. మిగులఁ దేజంబు గల్గిన ƒ మృదుసరణినె
కాక యర్థంబు లార్జింపఁ ƒ గలుగు టరిది
తైలమున్ గొన దీపంబు ƒ చాలునొక్క
నడుమ మొత్తని వత్తి యే ƒ ర్పడకయున్న. 77

తే. కేవలము దైవమునె కాదు ƒ కేవలంబు
పురుషయత్నంబునే కాదు ƒ బుధవరేణ్యుఁ
డభిలషించును రెండు శ ƒ బ్దార్థములను
సమముగాఁబూని వర్తించు ƒ సత్కవివలె. 78

తే. స్థాయిభావంబునకును సం ƒ చారి ముఖ్య
భావములు రససిద్ధికై ƒ బాసటయగు
నటు జిగీషు నృపాలు జ ƒ యంబు గోరి
సాయపడుదురు పలువురు ƒ క్ష్మారమణులు. 79

---

*క. రసభావజ్ఞుం డగు కవి
ప్రసాద మోజస్సు నియమ ƒ రహితమ్ముగఁ గూ
ర్చు సరణి క్షమమో తేజము
రసాపతి పొలార్చు నవస ƒ రజ్ఞుం డగుచున్. అని పాఠాంతరము.

తే. మంత్రిశక్తి బృహన్మూల § మాన్య, మున్న
తంబు నైన యుత్సాహపా § దప మొసంగు
నెందును గరప్రచేయమ్ముఁ § బృథుతరంబు
నైన ప్రభుశక్తియను ఫలం § బవనిపతికి. 30

తే. తా ననల్పత్వముననె ప్ర § ధానతను వ
హించు వంశస్వరంబున § కితరము లగు
స్వరములట్లు జిగీషు వౌ § ప్రభున కితర
నృపులు పరివారమై భజి § యింతురిగాదె! 31

క. ఏపని తాఁ జేయక విభు
కై పరసంపాదితమ్ము § లగు నర్థతతుల్
భూపతి మమత గ్రహించున్
దేపకుఁ బరకృతము స్వనము § నింగియుఁ బోలెన్. 32

తే. ఎదుటఁ బగతుఁడు వెను దన్ని § పృష్ఠచరుఁడు
నన్యు లందంద వెలయ నే § కార్థతంతు
వందుఁ గ్రుచ్చంగఁ బడ్డ మా § ల్యముననాయ
కాయితుం డయి చెన్నారు § నాయకుండు. 33

తే. షడ్గుణాఖ్య నొప్పారు ర § సాయనంబు
నేపు గోరెడివాఁడు గ్ర § హింపవలయు
నందువలననె యాతని § యంగచయము
స్థైర్యమున్ బలముం గనఁ § జాలు నండ్రు. 34

తే. శక్తి కలుగని తఱి యోర్పు § శక్తి గలుగు
వేళ వ్యాయామము నొనర్పు § వృద్ధి కలుగు
సంగముల తోడి తేండ్లకు § నట్లు గాక
శక్తి మించిన పని యైన § క్షయము కలుగు. 35

తే. కానఁ జేదీశునకు నవ § మానము ఘటి
యింపకాతఁ డుదాత్తుఁడై § యేకపదము
నంద చెలరేఁగి రిపుల ను § దాత్త మితర
మైన స్వరముల నట్లు ఘెం § డాడుచుండె. 3

క. శిశుపాలుఁ డొకఁడె సుఖముగ
వశుఁ డగు నని యెంచఁబోకు § పార్థివగణ మా
శిశుపాలు ననుగమింతురు
యశ మని బహురుజలు రాజ § యక్ష్మనుబోలెన్. 87

తే. ఫలము నొంది సపక్షమై § పరవిభేద
దక్ష మైనట్టి బాణమై § తనరు బాణ
దైత్యుఁ డియ్యెడ గుణదామ § తం దనర్చు
చైద్యుఁ డనియెడి బలు విల్లు § చేతఁబట్టి. 88

తే. అన్యులౌ కాలయవనసా § ల్వాదు లైన
వారు రుక్మిద్రుమాదులౌ § వీరు లెల్ల
తామసోపేతులౌటను § దామసాత్ముఁ
డైన చైద్యుఁబ్రదోషునే § యనుగమింత్రు. 89

తే. వార లియ్యెడ సంధిసం § బద్ధులనకు
చైద్యకల్పితభేదంబు § స్వల్పమునకు
నెండుకట్టెల దహియించు § నింతగాలి
యట్లె నీపయి వారలు § నలుగువారె. 90

తే. అల్పుఁడైనను బెద్దసా § హాయ్య మొంది
కర్జములఁజక్కపెట్టును § ఘనుని మాట
చెప్పనేల? మహానదిఁ § జేరి యైన
కొండవాగులు సంద్రంబుఁ § గూడును గదః 91

తే. అరికిఁ గూర్చువారలును నీ § కహితు లైన
వార లెల్లరు చైద్యుని § పక్షమె కదః
వానితోడ విరోధమ్మ § పడెడువేళ
మిగులు వారలే నీకౌను § మిత్రగణము. 92

తే. ఇటులఁజేయుచు నృపలోక § మెల్ల రేఁపి
ధర్మసూతి మఖధ్వంస § కర్మదక్ష
లైన శత్రువులందుఁ బ్ర § ధానపురుషుఁ
డీవ యగుదువు కాన నీ § వెఱుఁగు మిదియ. 93

తే. చుట్టమైనట్టి ధర్మాత్మ ✤ జుండు మదిని
నెంత బరువు మూఁపున వహి ✤ యింప నేర్తు
వని నినున్ నమ్మి కర్తుభార ✤ మును వహింప
నిచ్చగించుచున్నాఁడు విం ✤ టే ముకుంద! 94

తే. తమ్ము భజియించు రిపుల నై ✤ త మ్మనుగ్ర
హింతురు మహాత్ము లలఘుస్ర ✤ వంతు లంత
రాంతరమ్ములఁ దముఁ జొచ్చి ✤ నట్టి కొండ
నెలలను సపత్నులన, కబ్ధిఁ ✤ జేర్చుఁ గాదె. 95

తే. బలియుఁ డేనాటికేని దాఁ ✤ బగఱ నొంది
తనకు వశవర్తులను జేసి ✤ కొనును, గాని
మనసు విఱిగిన మిత్రు ✤ లేమాడ్కి వశ్యు
లౌదురే వారి యిష్ట మా ✤ నటులఁ జనిన. 96

తే. శాత్రవునిఁ జంప సురలకు ✤ సంతసంబుఁ
గూర్చు టొప్పదె యని యెంచు ✤ కొందు వేని
యజ్ఞమే వారలకు విందు ✤ లమరఁ జేయుఁ
గానఁ గ్రతువును జేయింపఁ ✤ గడఁగు టొప్పు. 97

ఆ. అగ్నులందు వేల్చి ✤ నట్టి హోమద్రవ్య
మమృత మంచుఁ జెప్పి ✤ రఖిలబుధులు
మందరాద్రిఁ గడలి ✤ మథియించి రనుగాథ
కేవలమ్ము సురల ✤ కీర్తికొఱక. 98

క. మానార్థకు మేనత్తకు
తా నీసుతుఁగాతు నూఱు ✤ తప్పులదాఁకన్
నే నభయ మిచ్చితిన యని
నీ నెఱపిన తొంటి ప్రతిన ✤ నిలుపుకొనఁ దగున్. 99

ఆ. ఉత్తమునకు వాక్య ✤ మొక్క తెఱం గగు
వాఁడి యయ్యు బుద్ధి ✤ వఱలు మృదుత
వేఁడి యయ్యు మనసు ✤ పీడింప దన్యుల
శౌర్యసరణికృతము ✤ శాంతియుతము. 100

తే. తొలుత దయతోడ శపథంబుఁ ✽ బలికినాఁడ
వవధిలోపల నతనిపై ✽ నలుగఁ దగునె?
తీఱి యలుగుచు నపకీర్తి ✽ తెచ్చుకొనకు
ఘనుఁ డెపుడేనిఁ దప్పునే ✽ పగటిమేర. 101

తే. వలతి మిన్నలు వేగుల ✽ వారు తీర్థ
పదములఁ జరించి శాత్రవ ✽ పార్థివాప
గాళిగాంభీర్యముల నెల్లఁ ✽ గనఁగనేర్తు
రంతవఱకు నిరీక్షింప ✽ నగును నీకు. 102

క. వాసి ననుత్పాతత్రిపద
న్యాసయు మఱిసన్నిబంధ ✽ నయు సద్వృత్తి
వ్యాసక్తియును నపస్పశ
భాసిలునే? రాజనీతి ✽ వ్యాకృతిపగిదిన్. 103

సీ. మఱియు నొక్క రహస్య ✽ మెఱిగింపవలయును
శత్రుదేశనివాస ✽ చతురులఁ బర
మర్మజ్ఞులను స్వీయ ✽ మర్మంబు లొఱు తెరుం
గక యుండఁ జరియింపఁ ✽ గలుగువారి
నరిదత్తవేతను ✽ లౌ చరులను జేర్చి
మన మిచ్చు భృతిఁగూడఁ ✽ గొనఁగ వారి
నొప్పించి వారిచే ✽ గొప్ప నేర్పొప్పఁగాఁ
బరరాజమంత్రుల ✽ వ్రాలు సృష్టి
తే. వెలయఁ జేయించి శాసన ✽ ములు లిఖించి,
నృపుని సన్నిధిఁ జేరిచి ✽ రిపుల కిట్లు
సహకరించెడివారని ✽ స్పష్టపఱచి,
సచివనృపులకు భేదమ్ము ✽ సలుపవలయు. 104

తే. బహునిపుణులైన చారులఁ ✽ బంపి, పాండు
పుత్రయజ్ఞంబుకై వచ్చు ✽ పౌఱపు మేఱయ
యుద్ధసన్నద్ధులై రాఁగఁ ✽ బ్రోత్సహించి
చేర్పు నీ మిత్రులను యుధి ✽ ష్ఠిరుని పురికి. 105

తే. అర్ఘ్యవిధులను ధర్మరా । జప్డు పూజ్యు
నిన్నుఁ బూజింప నోర్వఁగా । నేరనట్టి
చపలాలును మత్సరులు నైన । శత్రునృపులు
తామె కయ్యంబునకుఁ గాలు । ద్రవ్వఁగలరు. 106

కం. కాకములచేతఁ బెఱిఁగిన
కోకిలఁ దన్నెఱిగి కరట । కూటము విడదే
శ్రీకరుఁడు చైద్యుఁ డైనన్
బ్రాకటసుజ్ఞాను లపుడ । పాయుదు రతనిన్. 107

తే. సహజచాపల దోష దృ । గ్జనితగర్వ
మొంది దుర్బలపక్షంబు । లూని రిపులు
పర్వి నీ పయి నీ దురా । పప్రతాప
వహ్ని కగుదురు సుమి శల । భములగములు. 108

తే. అనుచు నయమార్గమున దుర్ణ । యార్గళముగ
వినుచు స్పష్టార్థ మగు నుద్ధ । వుని హితోక్తి
దన యెద వసించు శ్రీయును । దాను మాత్ర
విని స్వపీఠంబు నుండి లే । చెను మురారి. 109

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శ్రీకృష్ణుఁడు బలరామోద్ధవులతో మంత్రాలోచనము
చేయుటయు, బలరాముఁడు స్వాభిప్రాయముఁ
జెప్పుటయు, శ్రీకృష్ణున కుద్ధవుఁడు స్వాభి
మతంబు నెఱింగించుటయు ననెడి
ద్వితీయాశ్వాసము
సమాప్తము.

శ్రీ ర స్తు.

# శ్రీమదాంధ్రమాఘము

[శిశుపాలవధమహాకావ్యము.]

## తృతీయాశ్వాసము

—*—

—* శ్రీకృష్ణుని ప్రస్థానవర్ణనము *—

క. ధనపతిదిశ విడిచి యగ
స్త్యుని మార్గము చేర తపను § చొప్పున యుద్ధా
ధినివేశ ముడిగి హరి యొ
య్యన నింద్రప్రస్థనగరి § కరుగఁగ వెడలెన్. 1

చ. జగములకున్ బవిత్రిత నొ § సంగఁగఁజాలుచుఁ గ్రాలునట్టి యా
తిగ వెలుఁగున్ నిజాంఘ్రులను § దెంపునఁ బూజ్యులకెల్లఁ బూజ్యుఁడై
తగియెడు వెన్ను దాఁకదు గ § దా నెఱ పున్నమినాఁటి చందురున్
మిగుల హసించు బల్సిరుల § మేకొను ఛత్రమతండు దాల్చుటన్. 2

ఉ. తామరతూండ్లలోని నును § దారములన్ బలెఁ దెల్లనైన విం
జామరజోయి నెన్నడిమి § చక్కని నెక్కొనియున్న నీరద
శ్యాముఁడు శౌరి పొల్చె దివి § జాపగ రెండు తెఱంగులై పడన్
గోముల మించు సంద్రమున § కున్ సరివచ్చు చకచ్చకద్ద్యుతిన్. 3

క. మకుటగతమణులఁ జిత్రా
ధికకాంతులు వొలయ వాసు § దేవుఁడు బహుగై
రికధాతురూషితశిలాం
శుక మగు గోవర్ధనాద్రి § సొంపు వహించెన్. 4

ఉ. వాని శ్రవోయుగంబున వి § భాసిలు బంగరు కుండలంబులన్
జానగు పచ్చరా మిసిమి § సల్ పయిఁ గ్రమ్మఁగఁ బేరురమ్ము బా
ల్యాన నతండు నెమ్మిపురి § యంధపుఁ బేరు లలంకరింప నిం
పూనిన నాఁటి వైభవము § నొందెనె నేఁడు ననం గనంబడెన్. 5

క. కవ్వపు మలతల చివురుల
మవ్వంబుగ సాన తిరుగు § మణుల రుచులనన్
నివ్వటిలు నంగదంబుల
వివ్వచ్ఛుని మేనమఱఁది § వెలసె సొగసులన్. 6

క. ముంజెయి మురుగుల కెంపుల
కెంజిగి సహజారుణంపుఁ § గేల్గోళ్లందున్
గంజాక్షుఁ డసురపేరుర
ముం జీల్పన్ వెడలు రుధిర § ముం బురణించున్. 7

క. దివి, యిరువాకల గంగా
స్రవంతి ప్రభవించి పాఱు § సరణి వినీల
చ్ఛవి శౌరి యక్కు మిక్కిలి
సవురుం గనె మంచిముత్తె § సరి ధరియింపన్. 8

చ. జలధి మథింప మున్ను జల § సారముగా జని గన్న కౌస్తుభో
జ్జ్వలమణి కాంతిసంతతి దె § సల్ గలయన్ బ్రసరించి మించ న
య్యలఘుఁడు దాల్చె నందు జగ § మంతయునుం బ్రతిబింబితంబు నై
చెలఁగెఁ దదీయకుక్షిని వ § సించు జగమ్మని భ్రాంతి గొల్పుచున్. 9

చ. హరి మొలత్రాడునుండి దిగి § హజ్జలపజ్జకు వ్రేలు ముత్తెపున్
సరము, గురుప్రభావిసర § సంపదకుం గడుఁ దావలంబ యై
కరము వెలింగె నయ్యనఘు § కాలిని బొట్టనవ్రేల బుట్టి పై
కిరవుగ నెత్తు లేచి ప్రవ § హించెడి తుంగతరంగ గంగ నాన్. 10

క. హరినీలమణిద్యుతుల రు
చిరమై యరదళపుఁబసుపుఁ § జేలము గల యా
మురవైరి తమ్మిపుప్పొడి
తరఁగల పైఁ దాల్చు యమునఁ § దలఁపగఁ జెసెన. 11

తే. చక్కఁ గై నేసికొన్న యా § శౌరి మేన
నెల్లఁ బొడమిన లక్ష్మి దా § నెల్లరకుఁ బ్రి
యగనె యాట యుక్తంబ య § నన్యకాంత
యా నితరలక్ష్మి హరి యుర § మందె యుండె. 12

క. విరివి గల యురమునందున
సిరి యొకతె వసించి మిగులఁ § జెలువము నిడఁగా
నరుసింప జగం బెల్లమ
బెఱ సిరి మురహరుని మేన § వెలసె సతంబై. 13

క. అసురపతి ప్రాణవిసరము
పసలడఁచిన గోళ్ల యాన § వాళ్లన్ గాతి
న్యసరణుల వెలయు గుబ్బల
మిసిమి యొసఁగ నుండి రన్ను § మిన్నలు చుట్టున్. 14

క. ఉరువును నెత్తుం గల కుచ
భర మాకర్షింపఁ బలుచ § పడి నెన్నడు మా
కరిణీ యానల కొప్పెన్
గరమున్ వంగెడి నయంబు § గనెనో యేమో? 15

ఉ. ఎవ్వతె నెవ్వతెన్ వలపు § లీనఁగ, నోరగ శౌరి చూచునో
యవ్వగలాఁడి సిగ్గు మెయి § నొదలఁ గ్రిందికి వంచునంతలో
నెవ్వగ తెచ్చు నన్యరమ § ణీమణి లీసున దాని జూచి మై
నొవ్వగఁ గొట్టుచుండుదు ర § నూనకటాక్షశరాళి నాతనిన్. 16

ఆ. నల్ల యగిసిపువుల § నుల్లసం బాడెడు
దితిజరిపుభుజంబు § తేజు గాంచె
చక్రధాళధళ్య § చయము నర్తింపఁగా
మేలి సుడుల యమున § జాలు వోలె. 17

తే. పగతుర యొడళ్ల మర్దింపఁ § బటిమఁ దనరి
యుర్వి సర్వత్ర విజయంబు § లొసఁగఁజాలి
నిత్యసాన్నిధ్యవిభవంబు § నెగడి మిగుల
మోదమున కవుఁగాదె కౌ § మోదకి గద. 18

తే. సహజసత్వాధ్యుడైనట్టి § శౌరికి గజ
హయరథాదిబలంబుల § జయము లరుదె
యైన నరి యుసురులఁ గొన § నాటితేఱు
నందకమునకె యన్వర్థ § నామ మబ్బె. 19

తే. చేతఁ బట్టంగ నెవ్వని § చేతఁగాక
గుణము నెవ్వాని వీ న్వజ్జ § కుం గడంక
కార్యములఁ జేర్పకుండెడి § ఘనసుహృత్తు
వలెను శార్ఙ్గంబు హరి పజ్జ § వచ్చి నిలచె. 20

ఉ. నీలపయోధి చెంగటను § నిల్చిన హంసముఁ బోలి పాంచజ
న్యాలఘుశంఖ మచ్యుతుని § యండకుఁ జేరి సమీరడింభకున్
హేలమెయిన్ గ్రహించి విని § పించెను గానము వీనువిందుగా
నీలపయోదబృందరమ § ణీయగభీరనినాదరీతులన్. 21

తే. ఇష్టసిద్ధిని సాధించి § యెల్లదిశల
కడ్డు లేక చరించుచు § నరుగు పుష్ప
మను రథంబు మహారథుం § డయ్యె హరి వ
సించెఁబుష్యస్థితేందుని § చెలువు గాంచి. 22

ఉ. యాదవరాజసింహుని ధ్వ § జాగ్రమునన్ వసియించుచున్ మణీ
మేదురమేదినీస్థలిని § మేన్ బ్రతిబింబితమైన వైనతే
యాదిమపక్షిరాణ్మణి ర § యంబున గూఢపదాన్వయమ్ములన్
ఖేదిలఁజేయుఁ గ్రింది భువి § కిన్ బఱతెంచు నటంచుఁ దోఁపగన్. 23

చ. మురియుచుఁ బైనమైన యదు § పుంగవు దుందుభి నుద్భవించు ని
ష్ఠురరవ మద్రులన్ బగులు § చున్ మఱి యన్యరవంబు లందునన్
గరము విలీన మయ్యె ఘన § కంధిజలంబులయందు నాపగో
త్కరసలిలంబు లెల్ల విది § తమ్ముగ లీనము లౌటఁ జూడమే. 24

ఉ. లోకము లన్నిటిన్ గడుపు § లోఁ గను గందక తార్చి ప్రోచు సు
శ్లోకుఁడు వెన్నుఁ డెయ్యెడలఁ § జొక్కపుటజ్జల నిల్వ నయ్యెడన్
బ్రేఁకనఁ గ్రిందికిం దిగెడు § వేతలలన్ శ్రమ మాన్ప మూఁపులన్
బై కెగయించి మీటుఁ గదః § పన్నగభర్త రసాతలంబునన్. 25

క. తోరణము లున్నతనములే
యై రాజిలు, కాని పడగ § లవిరాయ నటుల్
సారె కవి వంచి జోదులు
శౌరి ననుగమింత్రు ఫలము § సాధనయుబలెన్ 28

ఉ. వామనచాయఁ గావిరుచి క్ష జానగు నేస్గుల దానవారి, స్వ
ర్ణామలభూరజంబు దడి క్ష యన్ బలు నెమ్మిపులుంగుపించపున్
శ్యామలకోమలారుణపి క్ష శంగరజంబులఁ బోల విన్నప
ట్టా మునుఁగన్ జరించెను గక్షడంక రథంబులు నుగ్గు చేయఁగాన్. 27
ఉ. ఏపగు నష్టలోహముల క్ష నిద్ది ప్రతిష్ఠిత మన్న కీర్తి న
ష్టాపద మొందుఁ దద్ధరణి క్ష సైంధవరింఖల రేఁగు ధూళియున్
బ్రాపును గాంచ దుద్ధతులక్షపైఁబడ దింత మహాజనంబు పై
నీపథ ముత్తమంబు గణి క్ష యింప విశిష్టగురుత్వశాలికిన్. 28
చ. కడుజతనంబుతోడఁ దుర క్ష గంబుల రౌతులు పట్టి నిల్వ ముం
దడుగుల నెత్తి త్రోవ కౌర క్ష యంతరమై చను ధీరదంతులన్
గడచి చనంగఁ గోరు నటు క్ష గాదొకొ యెంత గురుత్వమేదురున్
గడిచి పురోగమింపరాకొ క్ష కార్యవిదుల్ దమ కడ్డ మైనచోన్ 29
ఉ. ఆఁపగరాక పర్వెడు హక్షయంబులఁ గళ్లెములన్ బిగించి తా
మాఁపిన సాదిమిన్నలు, ముక్షదంచితరీతుల దుమ్ముతోడఁ గ్రీ
డాపరులైన బిడ్డలనుక్షడాయుచు పైళమ కన్నతల్లు లా
యాపథమందునుండి కడు క్ష నాదట నెత్తుకపోయి రయ్యెడన్. 30
ఉ. చిన్నతనంబునుండియు, నక్షశేష మెఱింగినయట్టివారలున్
వెన్నుని జేరి కన్గొనఁగక్షవీథిని వీథిని మూఁగి రెంతయున్
తిన్నగఁ గూర్మి మొల్కగొని క్ష తీవలు వారెడి పట్ల నిత్యమున్
గన్నులఁ గన్న వస్తువునె క్ష గాంతురు నూతనవస్తువట్లొగిన్. 31
మ. ఇషుముం జల్లిన నేల రాలనటు నెంక్షతే లెక్కడున్ మీరు శూ
రసమూహంబుల రథ్య క్రిక్కిఱియజాక్షలన్ మెల్లగాఁ దేరు వో
లసమాచాంచితవైభవం బెసఁగు ప్రోక్షల న్విందుగాఁ గాంచు చ
క్రి సమీక్షింపఁడు స్వీయ మౌ రథము నేక్షగెన్ మెల్లగా నంచహాః. 32

—* ద్వారకా పుర వర్ణనము *—

ఉ. ద్వారవతీపురీవరము క్ష బంగరుకోటలమేటి డాలు ది
గ్వారము దాఁకఁ బచ్చని చౌ క్ష కాటపుఁ దేజులఁ గూర్పఁగా నకూ
పారజలంబునుండి బడ క్ష బావదనోజ్జ్వలకీలి యెయ్యెడన్
జారుతరంబుగాఁ బసుపుఁ క్ష జాయలనీనెడి యట్లు తోఁచెడున్. 33

తే. భూమిభృన్మౌళు లెలసిన $ మొదటి తావు
జలధితరఁగల చుట్టారు $ నలఘుమూ ర్తి
పుడమికిని బ్రతికృతియనఁ $ బోలు ప్రోలు
ధాత సృష్టించి కుశలుఁడై $ తనరినాఁడు. 34

ఉ. సంతత మభ్యసింపఁ గాన $ సాగిన నిర్మితి కౌశలాన ధీ
మంతుఁడు విశ్వకర్మ లస $ మానవిధానము మేరగాఁగ న
త్యంతము సృష్టి చేసె నని $ యాడఁదగుం బురివేల్పుటిక్క యి
శ్రాంతవినిర్మలాబ్ధికుక $ రప్రతిబింబము లీల దోఁచెడున్. 35

ఉ. అంకమునందు నిల్పి తన $ యన్ నగరీవరకన్య శేషప
ర్యంకున కిచ్చి పెండిలిని $ రంజిలఁజేయు ముహూర్తమందుఁ బ్రే
మాంకముగాఁగఁ గూఁతునకు $ నంబుధిరా జుపకంఠసీమ శో
భాంకురముల్ జెలంగు మణి $ హారము లిచ్చిన ముచ్చ టెట్టిదో! 36

క. చలియించు నలలఁ బయిపయి
తొలుకాడెడు సంకుగముల $ తోఁ బ్రాకారం
బొలయుఁ బురి; పెక్కు రిక్కల
వెలయు సుమేర్వద్రిసాను $ విధమునఁ దోఁచున్. 37

మ. పురిలో నంగడివీథులందు బలు ప్రోవుల్ చేయఁగాఁ బడ్డ భా
స్వరరత్నంబుల నంబునిర్గమతతుల్ $ సందర్శింబునం జేర్పఁ ద
స్కరుఁడై వానిని బ్రోవుచేసికొని గాం $ చం గల్గె రత్నాకర
స్థిరనామం బిపు డబ్ధి; తొల్తఁ గలదే $ చెన్నైన యాపే రెటుల్. 38

క. నీరు స్రవింపఁగఁ గాంతిన్
వారింపఁగ నురువు మణుల $ వార్నిధివీచీ
చారుకరంబుల నెండకు
నాఱఁగ నాఁ దల్పతలము $ నందుం బఱచెన్. 39

ఉ. కోటను గాచు నున్నతపు $ గోడల యెత్తును గెల్వఁ గోరికల్
వాటిల దవ్వునుండి పర $ వళ్లను ద్రొక్కుచు లేచు నూర్మి లే
పాటున గోర్కె తీర్చుకొనఁ $ బాటవ మింతయు లేక సిగ్గుతోఁ
జీటికిమాటికిన్ లయముఁ $ జెందుటఁ జూడమె నేఁడు నాఁడునున్. 40

ఉ. లోనఁ బ్రవేశముం గొనఁగ § లుబ్ధమతిన్ గుతుకంబుతో రయం
బూనుచు వారిద మ్మొకఁడు § హుమ్మని కోటపయిం జనంగఁ ద
న్మానితపద్యభాగములు § మత్సరతన్ దను నడ్డగింప, బల్
ధ్వాన మొనర్చి వేగ జడి § వాన నెపంబున నేడ్చు నివ్వలన్. 41

తే. మాకు ద్వారావతీవధూ § మండలికి వి
భేదకం బగు గుణము క § ల్పింపు మనుచు
నచ్చరల్ గోరఁదన బ్రజ § కపుడ మనువు
తెప్పపాటు ఘటించె గు § ర్తింప వేఱ 42

మ. ఇవపుంజాయల వేల్పుమే ల్పసల నె § ంతే లీనమై భేద మిం
త విలోకింపఁగరాని స్ఫాటికమణీ § నానోచ్చసౌధంబు లు
త్సవ మొప్పంగను నెక్కి ద్వారకపురిన్ § ధన్యాంగనారత్నముల్
దివిజాంభోరుహపత్రినేత్రలవలెన్ § దీపింతురి రే లన్నిటన్. 43

చ. జలధరమండలంబు తమ § చక్కి కథఃకృతమైన నున్జలం
బులఁ బరిపూరితంబు లయి § పొల్చు జగా నెలతాల కట్టనం
బులఁ దగు నేలలన్ దనరు § పున్గను సౌధతలంబులన్ విరా
జిలు జలమార్గముల్ ప్రతిని § శీధిని వారక ద్వారకాపురిన్. 44

ఉ. అందలి గేహినుల్ సురత § మప్పుడు సిగ్గున దీప మార్పియున్
గొందరు భీతిచంద్రు వెలుఁ § గుల్ మది జాలసమాగతంబులై
మందిరపున్ విదూరమణి § మండితభిత్తులఁ బిల్లికన్నుచాల్
చందమునన్ భయప్రదవి § లాసములై ప్రసరింపఁ గాంచుటన్. 45

ఆ. యువతు లిండ్ల గోడ § ల వెలయు సున్నలఁ
జిత్రములను వ్రాయఁ § జేతగాక
తామె ప్రతిఫలించి § తమ గోడల సజీవ
చిత్రరీతిఁ బురిని § జేయు చంద్రు. 46

ఉ. అచ్చపుఁ బైఁడికాంతి గల § యాపురయౌవతదేహలీలలన్
వచ్చనె వేఱు సేయ నను § బంగరు కంబములందు నీడలై
చొచ్చుటఁగాని క్రొమ్మరుల § స్రుక్కుచు బొందిమఁ గ్రక్కుచెక్కుతే
యచ్చుగ వజ్రదర్పణము § లట్లగుటన్ భిద కొంత యేర్పడున్. 47

క. పురి మేల్గిముల గడపలు
మరకతనిర్మితము లౌట ƒ మఱి ముంగిళ్లన్
వఱలిన డాల్ గోమయ మని
పౌరి గోమయమునను నలుకఁ ƒ బూనరు ముగుదల్. 48

తే. బర్హములు వ్రేలఁగాఁ జూలు ƒ పట్టెలందు
నెమిళు లట నొక్క క్షణమేని ƒ నిలుచువేళ
మరకతశ్యామతృణమనో ƒ హరము లైన
చూలులఁ దనర్చు తేవ సొం ƒ పారు నిండ్లు. 49

సీ. బరువైన దూలాల ƒ భరియింపఁ బృథులకు
లంబు లయ్యును నిస్తు ƒ లంబు లగుచు
లలితవితానమా ƒ లాపినద్ధము లయ్యు
నవితానతానిల ƒ యంబు లగుచుఁ
జతురకళారహ ƒ స్యవిచిత్రముల యయ్యు
ద్వారాదులను సచి ƒ త్రమ్ము లగుచు
శతసహస్రజనపరి ƒ చార ముండిన విశా
లము లయ్యు భూరి శా ƒ లంబు లగుచు

తే. నఘటనాఘటనాకర్త ƒ యైన వాసు
దేవుఁ డేలెడు ద్వారవ ƒ తీపురమున
వసతిగృహములు తీరుల ƒ వసతు లనఁగఁ
గీర్తి కెక్కెను సౌందర్య ƒ మూర్తు లగుచు. 50

ఉ. తీవిగ నింటిముంగిట ఘ ƒ టించిన కుడ్యములందు గూఁడులన్
జీవకళల్ తొణంకునటు ƒ చెక్కిన చక్కని పక్కి బారులన్
జేవ మెయిన్ లటుక్కునఁ గ్ర ƒ సింపఁగఁ జూచిన మేను నిశ్చలం
బై విలసిల్లు పిల్లిని జ ƒ నావళు లెంతురు చిత్ర మం చహా! 51

క. చుక్కల కెత్తగు మేడల
నెక్కుట వృథగాదె? నేల ƒ నెవసత్రియు శశికిన్
ధిక్కారార్థకరణముఁ
జక్కఁగఁ గావింత్రు వదన ƒ జలజములఁ జెలుల్. 52

గీ. రమ్య లంచుఁ బతాకికా ƒ ప్రాప్తి గల వ
టంచును వివిక్త లగుట రా ƒ గాభివర్ధ
ను లనుచు, నమద్వశీక ల ƒ న్చు లలనాళి
సరిగ పలభుల సేవింత్రు ƒ పురిని యువలు. 53

చ. జతనము లేకయే సహజ ƒ సౌరభమున్ వెలిఁ జిమ్ముకమ్మ నా
నతివల మోములున్ మధుప ƒ లానగరిన్ గల కోదెకాంద్ర సం
హతికిఁ బ్రమోద మూన్ప వ్యతి ƒ హారము పూనె నటే స్వగంధసం
తతులను జిమ్ము కృత్యములఁ ƒ దా మయి యద్భుతరీతి నేమనన్. 54

చ. పురిని విహారవేదికలఁ ƒ బొల్పుగ నిల్పిన మత్తవారణో
త్కరముల ప్రేలు గూఁడుల స ƒ దా వసియించెడి పుల్గు మొత్తముల్
సురుచిర మందిరాలఁ గడుఁ ƒ జొక్కుచు దంపతు లాడు పల్కులన్
సిరు లొలుకన్ వసించుటను ƒ శిష్యగణ మ్మయి పొల్చు వారికిన్. 55

ఉ. సన్న జిలుంగుఁ బయ్యెద తె ƒ సంగును బైనను మాటెకాని యా
యన్నుల గుబ్బదోయి హాయ ƒ లంతయుఁ గన్నులఁ గట్టినట్టులై
యున్నదె యంబరంబు లవి ƒ వ్యోమసమత్వము నామమాత్రఁ గా
దెన్నగఁ నర్థమందును వ ƒ హించుచు మించును ద్వారకాపురిన్. 56

చ. కుటిలత సుంత గైకొనక ƒ కొంచెము నేన్ మరియాద వీడకె
వ్వటికిని పంకసంకలిత ƒ పద్ధతి గాంచక ప్రాంచదాయతి
స్ఫుటగతులై బెడం గడరుఁ ƒ ద్రోలి వినీతపథంబులందు నె
చ్చట నొక యింత జాఱ కని ƒ శంబును నేఁగుదు రప్పురిన్ జనుల్.

శా. తన్నే చూడుఁడు తన్నుఁ జూడుఁ డని మా ƒ త్సర్యంబు లేపార సం
పన్నీరేజదళాక్షి సోయగములన్ ƒ బాటించు పౌరాంగనా
శ్రీ న్నాశీకభవుండు చేసి మును క ƒ ల్పించెన్ సిరిన్ వజ్రకి
టౌన్నత్యంబున నన్నవాడు నెటో పా ƒ యం గల్గె నీనాఁటికిన్. 58

ఉ. ఆపురివారి కాత్మ నుద ƒ యం బగు కోరికి యెట్టిదేని యా
రూపున నశ్రమం బపుడ ƒ రూఢిగఁ జేపడుఁ గల్పవృక్షరే
ఖాపటలీప్రభావములఁ; ƒ గన్గొనియేనియు వారి వైభవ
శ్రీపరిపాటి యూహ మొన ƒ రింపఁగ నైన నసాధ్య మేరికిన్. 59

తే. ఆత్మసౌధప్రదీప్తుల ƒ నలమి దిశల
సకల కళ లూని, రేవతీ ƒ జాను లగుచు
రౌహిణేయుండు మఱియును ƒ రోహిణీశుఁ
డాపురంబున వసియింతు ƒ రనవరతము. 60

క. బాణుని రణమున నజగవ
పాణి గెలిచినట్టి చక్ర ƒ పాణికి సుతుఁడై
రాణఁ దను వెనసి సుమనో
బాణుఁడు పుర్రిఁ దిరుగు శస్త్ర ƒ పాణి యయి ధృతిన్. 61

తే. శివమరుత్తులు సేవింపఁ ƒ జిరము హరికి
వాసమై, రత్నకాంతులు ƒ పైకిఁ జిమ్మ
జలధినుండి ద్వారక మేరు ƒ శైలతటగ
తామరావతిఁ బిల్చుఁ గ ƒ య్యామున కేమొ. 62

గీ. వర్ణకాంతులఁ జెన్నారు ƒ వనితను బలెఁ
బురిని, నునుకాటుకల నల్పు ƒ పొల్పు గాంచి
వృత్తహృద్యత గని జగ ƒ ద్విదితతిలకుఁ
డైన హరి తిలక మటు సొం ƒ పలరఁజేయు. 63

ఉ. మేడల గోడలన్ వెలయు ƒ మేదురవజ్రపుధాళధళ్యముల్
గూడి చరింప సౌరపతి ƒ కూరిమి బల్విలు మేటి చాయ యన్
బోఁడిమి, దేవసేనలను ƒ బోలి యరిన్ భయపెట్టు తూరుపున్
వాడను జేరె శౌర్యనిధి ƒ ద్వారక నారయుచుం గ్రమంబుగాన్. 64

మ. జలజాతోద్భవు మోముఁదమ్ముల నొగిన్ ƒ జన్మించు వేదాల మం
జులశీతాంశుకిరీటమస్తకజటా ƒ జూటోద్గతాంబూర్ములన్
జలజాక్షాంగకజాతజాత మగు వి ƒ శ్వప్రాణులన్ బోలి యా
నలినాక్షోరుచమూతతుల్ వెడలె స ƒ న్నాహంబుతో ద్వారకన్. 65

చ. హయముల మోములన్ వెలయు ƒ నట్టి ఖలీనము లొండొకంటి పై
రయమున రాయ హేష లల ƒ రంగను ముందటికాళ్ల నెత్తి ని
శ్చయముగఁ బర్వఁబోవఁ గని ƒ సారెకుఁ గళ్లెములన్ బిగించి యా
హయములఁ బట్టి యాశ్వికజ ƒ నావళి గాసికి నోర్చి రెంతయున్. 66

తే. చిమ్మచీఁకటి దివ్వెచేఁ § జెదరునట్లు
జనసమూహముల్ కరులకు § జడిసి పర్వ
నెట్టి యిఱుకటములులేక § యిభబలములు
పురిని వీథులవెంబడి § నరుగఁ గలిగె. 67

మ. పురి ద్వారంబును దాఁట హస్తినఖముం § బొంకంబుగా నెక్కి తే
ర్లు రయం బొప్పఁ జరింప సారథులు ధీ § రుల్ వాగెలన్ బట్టుచున్
గరమున్ లాఁగ దురంగమంబుల మెడల్ § కై వైపు, వక్రింప, సు
స్థిరయుగ్మంబులతో రథాలు సమదా § త్రిన్ జేరె భద్రంబుగన్. 68

తే. భర్త కృష్ణుండు పరదేశ § వసతి గనఁగఁ
బ్రాణవల్లభ ద్వారక § బాహ్యవీథి
భూషణము లైన సైన్యముల్ § మున్ను డుల్చి
ద్వారకాత్వంబుపై కోర్కి § వదలఁ బోలు. 69

— సముద్ర వర్ణనము —

క. నీరధి కవ్వల యొడ్డునఁ
గారాకుల నల్పుబల్పు § గలుగు వనాళిన్
శౌరి గనె సతము తరఁగలు
పారమునకుఁ గొట్టు నాఁచు § పస మిసిమివలెన్. 70

సీ. నవనవోల్లసదనూ § న ప్రభా విసరముల్
చెలువొందునట్టు ల § చ్చిని ధరించి
కనువిందు లైనట్టి § ఘనతరంగములచే
వరలెడి యొడ్డు పై § వసతి గలిగి
సజలనీరదజాల § సామ్యంబులం గను
చామనచాయ బ § లౌన్నరు గాంచి
పుట్టిన దాదిగాఁ § బొలుపుల నేపారు
చారులతాసతీ § సమితి గాల్వ

తే. నలరు భూరుహచక్రవ § ర్తులను తనదు
శతసహస్రలసన్మూర్తి § సరణి గాఁగఁ
జూచె నేఁటి వాసుదేవుండు § సొబగు తెలుఁగు
మహితవిభవాభిరాముఁడై § మాన్యదృష్టి. 71

ఉ. భూమిపయిన్ సదా పొరలు భోరన నాఱుచు దీర్ఘవీచికా
స్తోమభుజాఖ్యకేతువులఁ దోరముగాఁ గడుఁ గ్రిందు మీఁదుగా
వేమఱుఁ ద్రిప్పుచుండుఁ, గడు విస్తృతి నుర్వులు గ్రక్కు నెన్నియో
బాముల నొందు నంబుధి; యపస్మృతిరోగి మదిన్ స్ఫురింపఁగన్.

చ. కడుపును నిండఁగా నమృత ఖండములైనఁ దినంగవచ్చు నా
జడధి స్వకుక్షి నిండినను జంద్రమయూఖము లాబకొల్ది దాఁ
గుడువఁగఁ గుక్షి యుబ్బినది గొబ్బున గ్రక్కునఁ దిన్నదాని ని
య్యెడ నని వెన్నుఁ డెంచె దరి నెల్లను గప్పిన ముత్తియంబులన్.

శా. సాటోపంబుగ నెల్ల దిక్కులను గర్జారావముల్ విన్పి వ
ర్షాటోపాన జగాల ముంపఁ గల నీరర్పించు మేఘాలు బ
ల్యాటంబౌ నొక చిన్న కోన జల మాస్వాదింపఁగాఁ బెద్ద ము
న్నీటన్ గాంచెను దృశ్య మొక్కటి జగన్నిర్మాత ధీరాత్ముఁడై. 74

ఉ. అచ్చటనుండి తీసికొని యచ్చటికే మరలించు నీతి తీ
అచ్చుపడంగ నంబుదము లబ్ధి గ్రహించిన నీఱు లబ్ధికే
యిచ్చు నదీవిధంబుల; మునీంద్రులు నైగమసంప్రదాయముల్
పొచ్చెము లేనటుల్ స్మృతులఁ బూన్తురు వేదము ద్రోవఁ బోవఁగన్.

చ. దెస దెస గల్గు వస్తువుల దీవుల నెల్లెడ విక్రయించి యా
వసుధ నలభ్యమైన విలువల్ గల నూతనవస్తుజాతముల్
వెసఁగొని యోడలం దునిచి వేడుకఁ గ్రమ్మఱు నోడ బేరులన్
బిసరుహగర్భుఁ డారయుచు వేమఱు వారిని బ్రోత్సహించెడున్. 76

ఉ. అంబుజగర్భు సేవకయి యంబుధిలోపలినుండి సర్పవ
ర్యంబులు వేగ వెల్పలికి రా గమకించి విరోధిపక్షిరా
జంబు శిరంబు గాంచి నతి సల్పుచు నూర్పుగముల్ విడంగ సం
ద్రంబున లేచు వీచులు పతాకవికాసము లయ్యె మెండుగన్. 77

క. తొలి తన, కుఱువను సెజ్జన్
జెలువారఁగఁ బండు శౌరిఁ జేరఁగఁ గని యి
మ్ముల నాపద్బంధుం డని
జలధియు నెదురేఁగుఁ దరఁగ జాల్ బాహులు గాన్. 78

క. ఏలాపనముల విడివడి
చాలన్ సౌరభము లొంది § జలకణగణమున్
బాలించి జలధి తెమ్మెర
లాలించుచు వెన్ను చెమట § లను, నింకించున్. 89

తే. చాల నెత్తైన తాళవృ § క్షవనమందుఁ
బరఁగి గేదంగులకును బా § పటల దిద్దు
వాయు సంచారతీరపా § ర్శ్వములయందుఁ
గూరుచుండిరి హరి సైన్య § శూరవరులు 80

ఉ. వారలు నారికేళఫల § వారము లానుచుఁ బచ్చిపోఁకలన్
సారెకు మేల్ రసంబుల ప § సం దిలకించుచు జాను క్రొమ్ముడుల్
చారులవంగసూనపుస్ర § జంబులచేత నలంకరించుచున్
వారిధికిన్ బ్రియాతిథిజ § నంబులుబోలెఁ జరించి రయ్యెడన్. 81

సీ. ఇది యొక్క గుల్మంబు § నెన్నఁడో గనె మున్ను
వేవేలు గుల్మముల్ § వెలయు నిచట
దీని భూభృత్తు మ § ర్దించెఁగదా మున్ను
భూభృత్సమితి గెల్చి § పోవు నిద్ది
తొలుతఁ గలిన లచ్చి § తొలఁగఁగా మను నిద్ది
సంతతస్థిరలక్ష్మి § జరుగు నిద్ది
యొక తీరమును దాఁట § కుండుఁగదా యిది
నెల్ల తావులఁ జరి § యించు నిద్ది

తే. నీచనీచప్రదేశాంత § నిలయమైన
సాగరం బిద్ది మేల్త్రోవ § నేగు నిద్ది
వారిధికి వాసుదేవుని § బలములకును
హస్తిమశకాంతరంబు నిం § డారె నపుడు. 82

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
ద్వారకనుండి శ్రీకృష్ణుని ప్రస్థానముయొక్క
వర్ణనము, ద్వారకాపుర వర్ణనము,
స ము ద్ర వ ర్ణ న ము న నె డి
తృ తీ యా శ్వా స ము
స మా ప ము.

శ్రీ ర స్తు.

# శ్రీ మ దాం ధ్ర మా ఘ ము

[ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

## చ తు ర్థా శ్వా స ము



### —* రై వ త కా ద్రి వ ర్ణ న ము *—

ఉ. రైవతకాద్రి తోఁచె నెదు రన్ హరికిన్ హరినీలకాంతిధా
రావృతచిత్రధాతునిచ యం బయి భూమిఁ బెకల్చికొంచుఁ, బై
పై వడి నేఁగుదెంచు ఫణి వారపుఁదోరపుటూరుపుం బొగల్
బ్రోవయి రత్నకాంతియుతిఁ బొల్పు వహించుచు నిల్చెనో యనన్.

ఉ. సానువులన్ మహాశిల లె సంగఁగ నాపయి యున్నతోన్నత
స్థానములందు నంబుధర సంతతి సంతతమందు నెల్లెడన్
మానక క్రమ్మి భానుగతి మానుపఁ బూనిక గొన్న వింధ్యమే
యీ నగమై పునర్జనన మెత్తెననన్ గిరి యద్ది భాసిలెన్. 2

తే. ఇంద్రనీలంపురాజిగి నీను సతము
హొన్ను చరియల నునుకాంతి హొయలు గురియు
నల్లరానిద్దపున్ మర్వు లుల్లసిల్లు
తేఁటిగమి విందులకుఁ బిల్చు తీవలెల్ల. 3

ఆ. పొరి సహస్రశీర్ష ములఁ గప్పి మిన్నెల్ల
నిల సహస్రపాద ములను గ్రమ్మి
నెలయుఁ బ్రొద్దు నేత్ర ములుగా వెలుంగ న
గంబు తా హిరణ్య గర్భుఁ డయ్యె. 4

తే. నీరు వెడలంగ తెల్లని నీరదమ్ము
లలఁతి నుదికిన తెల్లని యంబరముల
పగిది ధరియించి నగరాజు నగజ లేని
శర్వు భసితార్ధకాయంబు సరణి మెఱయు. 5

ఉ. పెంటుల పల్కు తీయముల § వేయు విధంబుల సొక్కి తూలుచున్
దంటతనంబు లెచ్చ దరిఁ § దార్కొనునట్టి పులుంగుఱేండ్లకున్
వెంటనె రేకు లెల్ల విడ § విప్పిన తామర తెల్ల వెల్లులన్
బంటయి పట్టుచుండె గిరి § నాథుఁడు చల్లని నీడ లబ్బఁగన్. 6
తే. స్కంధముల నీలకంఠ సం § ఘాతములును
దరుపులం దహిహారముల్ § తరళ శాఖి
కాగ్ర బాహువితానంబు § లమర నమిత
రుద్రులను దాల్చినట్టులీ § యద్రి యొప్పె. 7
తే. వ్రేలు నల్లని కలువలు § పీను సొమ్ము
లుగను లొద్దుగ పుప్పొడుల్ § పొలయు చెర్కు
లుగ నులప యుక్తసైకత § రుచులనిచయ
మీను నీరము దాల్చ గి § రీంద్రుఁ డెలమి. 8
తే. అచట రాజీవరాజీవ § శాఖ లలరు
నుష్ణముష్ణత్తరుచ్ఛాయ § లొప్పు మీఱు
ఘుటియుఁ గాంతాలకాంతులై § వఱలు సురల
సుదతులకు సోఁకుమూఁకల § సోఁకు లేదు. 9
తే. అమరు లచ్యుతు మెప్పించు § నాశఁ దత్రిలి
మేరుశృంగాలఁ గొని నిల్పి § నారు గిరిని
నంచుఁ గవివరు లాడు ప § ల్కుగునె కల్ల
యంద మౌన్నత్య మిందు నం § దమర సమత. 10
తే. పేరికెక్కిన యొక మేటి § పేర్మినుండ్రి
వలెను రైవతకమునుండి § ప్రస్థముల్లను
గొల్చి యుజ్వలమణిరాశి § కొదువ లేక
లోక మెల్లప్పుడున్ గొనుఁ § దేఁకువ మెయి. 11
చ. బిసరుహబాంధవుండు బలు § వెట్టలఁ గుప్పుచు మండుచుండ నే
దెస నరవిందబృందములుఁ § దీపిలు నాపృథివీధరంబునన్
బిసములు వంగఁదమ్మిపువు § పై ఘ్నునుఁ దేనియ లాని షైనము
తైసఁగుట నెండవేఁడి గణియింపవు సొంపవు తేఁటిదాఁటులున్. 12

తే. వేలకొలఁదిని గనులట్ల విచ్చు పువులు
వెలయు నొక్క మహోర్వీజ విభుని పజ్జ
రాజితం బగు గండోపశిలం బొకండు
సురపతిన్ మ్రోయు చౌదంతి సొంపు నింపు. 13

తే. అరుణుచే జాజువాఱు కౌశయముల వెలయు
తరణి హయములు వెదురు క్రొం దలిరుటాకు
పసిమి నెసలారు నయ్యద్రి పచ్చరాల
కాంతి రెట్టించి పచ్చనై క్రాలు మరల. 14

క. అన్నగమునఁ బన్నగభా
స్వన్నగ వనసీమ, గరళ వహ్ని యథఁగు ను
త్పన్నపయోదంబులు, పా
రె న్నవనీరంబులంగు రిసి తడుపుటచేన్. 15

క. ఇను కిరణంబులు వ్యాపిం
చిన నినకాంతోపలములు చెఱఁగును నిప్పుల్
కన గుణములు పాత్రగుణం
బున బహుగుణితంబు లగుట భూధ్రము తెలుపున్. 16

ఉ. నిచ్చలు చూచుచున్న మల నీటులు వెన్నుని కన్నుదోయికిన్
ముచ్చట తీనె నాయెతల ము న్నెపుడున్ గననట్టి వింత సొ
రచ్చపడంగ; నట్టిదె క దా క్షణమున్ మనుఁ గ్రొత్తక్రొత్త సొం
పచ్చుపడన్ గనంబడుచునె యా రమణీయత కెన్నఁ జిన్నెగన్. 17

చ. అనువుగఁ బక్కి నేర్చిన విహంగములన్ దనరారు తన్నగం
బును మన ముల్లసిల్లఁ గన మోముమ వెత్తిన గోము జూచి యా
వనరుహనాభుతోడఁ బలు పల్కుల నర్మ మెఱుంగు ప్రోడ గా
వున బలు డాలుకెంపెదవి పొల్పగు దారుకుఁ డిట్లు వాకొనెన్. 18

—* దారుకుఁడు రైవతకాద్రిని వర్ణించుట *—

తే. అవ్వతామిత సర్వ దిగంబరుం డు
దగ్రశృంగాత్త గోమూర్తి నధివసించు
ప్రోత శీతాంశుకోటి విభూషణుండు
నైన నద్రీశుఁ గని యెవ్వ రబ్రపడరు. 19

ఉ. మేరుసమాన వప్రచయ § మేదుర సన్మణి సాను రాగముల్
సౌర విలాసినీమణుల § చక్కఁదనంబుల గెల్వఁ జాలు నం
భోరుహపత్రనేత్రల స § మూహము వల్లభులందు సానురా
గేరితదృష్టి నిల్పి తమ § కించుట బొందగు నచ్చటచ్చటన్. 27

క. బంగరు రేఖలు సుధ రం
గుం గల యీవెండిగోడ § కొమరారును మే
నం గలయ భూతి మెఱయఁగ
నింగలపుంగంటితోడి § మృడు నిటల మటుల్. 28

క. అతి గురువు, లమిత జరఠము
లతి లంబ పయోధ రాల§సాలసములు నం
తత వసుభృద గమ్యలు పరి
ణత దిక్కరిక లగు తటుల § నగము భరించున్. 29

ఆ. ఈ సువర్ణతటము § భాసిల్లు వహ్నిగాఁ
బూచినట్టితరుల § పువ్వులందు
నళులు గప్పఁ గప్పు § లలరెడి ధూమశో
భలఁ దలిర్పఁ జూడు § వనజనయన. 30

చ. వికసిత పుష్ప సంభరిత § విశ్రుత కాంచన భూజ రాజితో
సకల దిగంతముల్ పసుపుఁ § జాయ వహింపఁగ నింగి దాఁకి మే
రు కుధర సానుతుల్య తట § రూఢులఁ దాలుచు నద్రి, కాన త
న్నికటపుదేశమెల్లఁ గను § నిత్య మిలావృత వర్ష సంపదన్. 31

చ. కనులకు వింతవింత లగు § కాంతులు బండు వొనర్ప రోమముల్
దనువుల భాసిలంగ బలు § తావులయందుఁ జరించు లేళ్ళు కొం
డను గల రత్నభాగములు § దంబుగ జంగమరూప మొంది యీ
యనువున గోచరించినటు§లౌను జుమా! గనుమయ్య యచ్యుతా! 32

ఉ. ముప్పది వత్సరాల్ వయసు § మున్నరికన్ గనుగాన నట్టి బ
ల్పొప్పిన యేనుగున్నలు స§ముద్ధతి నాడును దమ్మిపూలతో
నొప్పులకుప్ప లౌ నిజత § లోదరు లొద్దను సిద్ధసంఘముల్
దెప్పరమంది డెందము గ§డింది స్వరంబులసల్పు గానముల్. 33

మ. తమమందుం బడి దైవయోగమునఁ దర్దైన్యంబు వో యుక్త కా
లము వాంఛించెడి వేవెలుంగుదొరకున్ లాఁతుల్ దరిన్ జేర సా
ధ్యము కానట్టి తదీయపావనకళత్రస్థానముల్ గూర్చ నో
ర్పు మెయిన్దాము వహించు నీశిఖరి నాగరూఢంబు లౌ నోషధుల్.

ఉ. తేనియ లానఁగా ముసరు తేఁటుల కోటులు కాటు కౌను, బూ
లౌను గనుల్ వనస్పతుల యందపుస్కంధములే భుజంబు లౌ,
వానిని బట్టి ప్రేలఁబడు పల్లవముల్ మృదుపాణు లౌ, నిటుల్
మీనవిలోచనామణుల లీలల నేలెడి నీగిరిన్ లతల్. 35

క. బహు లయ సంగతితో నీ
విహంగములు పాడు, నీప విటపి వనమునన్
విహరించి కలఁపుఁ బవనుం
డహంకృతిని ఘనవితాన మటు నిటు చెదరెన్. 36

ఉ. ఇమ్ములలో వసించు నిధు లే నిగమప్రకరస్థ మంత్రరా
జమ్ములఁ బోలి పాపతతి సంగతిఁ బాపు శుభంబు లోము శా
స్త్రమ్ము లెఱుంగు విప్రుల వి ధమ్మునఁ; దజ్ఞులు చెప్పఁ జిత్త శా
చమ్ము గలట్టి వారెఱుఁగఁ జాలుదు రస్యు లెఱుంగ రింతయున్. 37

తే. పిర్రియను బింబోష్ఠి మోము చుంబించు కిన్న
రుం గనుచు మెచ్చు నొక్క తురంగవదను
డతఁడు కుచభారనతమధ్య నతివఁ గౌఁగి
లింపఁ దురగాంగుఁ డరసి హర్షించి మెచ్చు. 38

తే. శైలమందున వెలయు తమాలతాల
వనము నరయుము దట్టమై వనజమిత్రు
కరము చొరనీదు చూడని కాననమున
నలరు లమరని యొక లత యైనఁ గలదె? 39

సీ. రమణీయదంతాభి రామాకృతులు వారు
రమణీయదంతాభి రామము లివి.
యమలశిలామేఖ లాంతాకృతులు వార
లమలశిలామేఖలాంతము లివి

మణిచిత్రకటకసం పన్నాకృతులు వారు
 మణిచిత్ర కటకసంపన్నము లివి
స్నిగ్ధగండస్థలా స్వీతాకృతులు వారు
 స్నిగ్ధగండస్థలా స్వీతము లివి
తే. పృథునితంబసమంచితా కృతు లుభయము
నగుట నారీలలామ లీ యద్రిరాజ
దిత్యకలయందు విహరింత్రు నిత్య మివ్వ
కనుగుణంబుగఁ గంటివే యజ్ఞనాథ! 40
తే. కొన్ని మాత్రమె మగరాల గొనబుతున్క
లలము తెల్లని వెండి తావులు కొలంది
తడవు క్రిందట మబ్బులు విడిచినట్టి
బడగ లుడివోని నీటి సొంపును వహించు. 41
మ. ప్రియసాంగత్యసుఖంబు నెంచి జనమున్ వీడ్కొంచు నేకాంత మ
వ్యయమారాగ్నిఁ దపించుచున్ గనుల క్రేవల్ మంతమూఁతల్ వడన్
భయమున్ జెందెడి యోవ్రతంబు గనియం తన్ నెచ్చెలుల్ చుట్టు మూఁ
గి యిటన్ గాసిలుచుండి రారఘుము చక్రీ! యాదవోద్ధారకా! 42
ఉ. కీచక వేణు సంతతులఁ క్రిక్కిఱియన్ జుమరీగణంబు పె
ల్లేచిన వాలరోమ మొక యేనియు ఛిన్నము గాని రీతిగాఁ
బోరుచుకొనంగ నిట్టునటు పోవక నిల్చును వాయుపూర్ణ త
త్కీచక రంధ్ర నిర్గమిత గీతిరవ శ్రుతి ముగ్ధ మై నటుల్. 43
మ. సుసముత్యంబుల డాలు పాల సిరియున్ బొల్పారఁగా నీరమున్
ఘనముల్ నింపఁగ వాపికాతతిఁ దదంతర్లీన నీలాశ్మ ఖం
డ నిశాత చ్ఛురికా ఒసితాంశువులు గ్రస్సన్ స్వచ్ఛమౌ తజ్జలం
బును నీలీసలిలంబుగాఁ బరిణతంబున్ జేయు నీ యద్రిపై. 44
ఉ. అందఱకన్న మిన్న యగు నంబుజవక్త్రి నొకర్తుఁ బ్రేయసుం
డందఱ వీడి చేరఁ జని ప్రార్థన సేయఁ దిరస్కరించియున్
డెందమునందుఁ గిన్క విడి తీవిగ నిందుఁ జరించు భర్తకున్
మందముగాని సౌఖ్య మిడి మానవతీమణి పొంగు నాత్మలోన్. 45

తే. కెంపు మిన్కులు పయిఁ బర్వఁ § గిరణ మొకటి
వేయి వలెఁ దోఁపఁ జంద్రుని § వే వెలుంగు
గాఁ దలఁచి పద్మిని నిసిన్ బ § గంటవలెనె
వికచ కోకనదత్వమ్ము § వెలయఁ బూనె. 46

ఉ. జంకును గొంకు లేక తన § సన్నిధి నంకమునన్ జరించు నీ
వంకలు స్వాత్మజాతలు స్వభ § ర్తృగృహంబును జేరఁ బోవుచో
నింకని వత్సలత్వమున § నిందలి పక్షివిలాప మెంచుచున్
బింకము వీడి తోడ విల § పించెడి నిన్నగ మన్నటుల్ దగెన్. 47

క. విటపానమితలు బంధుర
విట పాన సమృద్ధ వృక్ష § వితతి దలిర్చున్
పటుపాక పిశంగలతో
త్కట సూన రజః పిశంగ § కటకము లివి గాన్. 48

మ. గిరి శృంగంబులనుండి జాఱి పడుచున్ § గ్రీవాదలం జేరు ని
ర్ఝరనీరంబులు రత్నకాంతు లలమన్ § సంజాత శృంగారది
క్కరిశుండంబును బోలు, నింద్రుని ధనుః § ఖండంబు వ్యత్యస్తశై
ఖరి వ్రేలంబడినట్లు గానఁబడెడున్ § గంజాక్షి! కన్గోఁగదే. 49

చ. పలుపలు రంగు లీను సుర § పాదపచారు సుమంబులన్ గడున్
జెలువము లొప్పఁగూర్చిన వి § చిత్రపుదండలఁ బోలునట్టి పు
ల్గుల పురు లద్రిరాట్ఛిఖర § కోటికి శేఖరపంక్తిఁ బెట్టిన
ట్టుల కనువిందుగా నగప § డున్ క్షణకాలము తేఱి చూడుమా. 50

చ. అమృతము గోరి మంధరధ § రాంతికసీమకుఁ జేరు దివ్యసం
ఘములను బోలువారు, సుఖ § కాములు కోకనదారుణాక్షిధా
మములఁ జెలంగువారు నిజ § మానినులుం దమతోడు గాఁగ శై
లము దరులన్ నవీనరతు § లన్ సుఖియింపక మాన రెన్నఁడున్. 51

ఉ. తెల్లని పూలదుప్పటిని § తీరుగ కాయము నెల్లఁ గప్పి లో
నల్లన నంగభాగముల § నార్చెడి యాగరవపత్రిధూమ మ
త్తెల్లెడ పావురా మెడల § హెచ్చుగ నల్పు నదల్పు నల్పు రం
జిల్లు మొయిళ్ల పిండు వెల § సెన్ గిరి కెత్తిన ధూపధూమమై. 52

ఆ. వె. విగతదోష రత్న § విస్తృతకిరణముల్
కలసి మింటఁ జిత్ర § గతులఁ దోఁచు
గుడ్యశూన్య మైన § గొప్ప చిత్తరు వని
ఖచరు లబ్రిపడుచుఁ § గందు రిందు. 53

ఉ. మారుతశీత మై శిఖర § మండలినుండు సుఖాభిలాషు లౌ
వారలకున్ ముదంబు గొలు§పన్ జల మెల్లఁ దొరంగి తెల్ల నౌ
శారదవారిదంబుల వె§సన్ దెరలట్టుల నిల్పి యిమ్మహో
దారనగం బుదారచరి§తమ్మున రూపున మిన్ను దన్నెడిన్. 54

సీ. మఱియు భోగస్థాన § మాత్రమే కా దద్రి
ముక్తజనాశ్రియం § బును జుమయ్య
మహితపుణ్యుల యెడ § మైత్రి దుఃఖులయెడ
కరుణ సుఖులపట్ల § నరిది ముదము
పాపులయెడ నుపేక్ష§పద్ధతియు నాల్గు
శుద్ధిమార్గంబుల § బుద్ధి నెఱిఁగి
యస్మితార క్త్యవి§ద్యాభినివేశవై
రములను నైదు క్లే § శముల మాపి

తే. ప్రకృతిపురుషులు వేఱన్న § భావ మరసి
చిత్తమును శూన్యవృత్తిగాఁ § జేసి యెపుడు
బీజయోగంబు సాధించి § విమలముక్తి
కోరు సాంఖ్యులకీ కొండ § గొప్ప యండ 55

తే. అర్కకిరణాలు తరువిట§పాంతరముల
నుండి మరకతభూములం § దోలి వ్రాల
నచట మెఱసెడి యణురేణు § నిచయమొందఁ
గలిగె నవనతశితికంఠ § కంఠలక్ష్మి. 56

చ. నిగనిగలాడు నీలిమను § నేటయి వీణియ మీటులందు జా
నుగ నునుతంతుర్రిలం జెలఁగు § నూతనగానములన్ వెలార్చు తేఁ
టిగములు పజ్జ మూఁగి కడు § తీవిగ వీనుల విందొనర్చ నే
మగువ నమస్కరింప దభి § మానము వీడి నిజేశుఁ జేరుచున్. 57

ఉ. సాయపువేళ రేవెలుఁగు చల్లని చాయలు చత్వరాల పై
గాయఁగ మెల్లఁగాఁ గరఁగి కాల్వాలుపాఱిన నీళ్లఁదోఁగి జ్వా
లాయుతసూర్యకాంతమణులన్ రహిఁ గొల్పెడి వహ్నికీల లం
దాయత మౌ మహావ్రత మహంబులఁ దీర్పు గిరీంద్రసానువుల్.

సీ. అధికపిశ్రీలును నధికపయశ్శ్రీలు
పటుతమపీయూషసం పత్తిఁ జెలఁగ
పవమానసుతజవ వివిధసంచారముల్
వివరింపఁజాలెడి విభవ మెసఁగ
లలితావిరతరామ లక్ష్మణాంచితములై
వీనువిందొనరించు జాను మెఱయ
నీరైవతకగిరి జారతాస్థానులై
యెన్నెన్ని సరసులో వన్నె గాంచు

తే. వరలు నిక్కొండ *"భరితకబంధభంగ
ములును" పవనజజవమునఁ బలితములును
సతతమరహితరామలక్ష్మణములు నయి
సరసు, లలనాటిభవసూక్తి సామ్య మెనసి. 58

క. కలభైరవరీతి ముదిత
కలభముల రవంబు లెల్ల కడల నలము ని
మ్మల నెల్ల వనములం బకు
రులఁ గాంచనరత్నఖనుల రోచులఁ దోఁచున్. 60

* మూలమున "అధికపయః శ్రియమ్" అను శబ్దశ్లేష మాంధ్రీకరణమున నసాధ్యము. ఒక యర్థమున "అధిక, పయఃశ్రీ" అనియు, రెండవయర్థమున "అధికపయః" అని, "అధికపి" శబ్దబహువచనాంత రూపము తెనుఁగునఁ గుదురదు. కాన, ఆయర్థమును విడిచి అర్థశ్లేషమున కనువుగా కబంధ=నీటియొక్క; భంగ=తరఁగలచే; భరితములని సరసుల పక్షమునను, కబంధ=కబంధుఁ డనెడి రక్కసునియొక్క; భంగ=నాశనముచే; భరితములని రామాయణపక్షమునకు సరిపడునట్లు "భరిత కబంధభంగము" అని యీయొక్కతావున మాత్రము మూలము విడువఁబడినది.

తే. కస్తురిమెకాల రాయిడి । గంధిల మయి
రల్లక మృగాంగకముల స్పర్శసుఖ మాని
వేణురంధ్రి నిర్గతగీతి । వినుచు వాయు
వలరు రాగియు బలె । విషయానుషక్తి. 61

ఉ. ఈ నగసాను భూములను । హేళి మరీచుల దవ్వు సేసి సం
ధానము చేసి చీఁకటిది।నంబుల రేలని భ్రాంతి గొల్పి యిం
పూనఁగ నల్లమబ్బుఁగము । లొయ్యన దంపతులన్ విలాస ఖే
లానవతశ్రమం బుడిపి । యవ్యయమోదము లందఁజేసెడున్. 62

చ. కటములపై మదం బడరి । కాఱఁగఁ గండువు దీర్చుకో మదో
త్కట మగు దంతి పూవులను । దాలిచి నేలకు వంగినట్టి యా
కటక మహీరుహంబు విఱు।గన్ బొడవన్ నెలవేది యల్క మై
పటువిషవహ్ని గ్రిక్కె ఫణి.।పాపుఁ గదా! చెడు కిన్క స్వార్థమున్.

మ. సకలైశ్వర్యమహానిదాన మగు నీ।శానుండె శీతంబునన్
బ్రికటార్తిం బడి కట్టఁ గప్పుకొన మే।నన్ సాంద్రనాగాజినం
బొకచే దాల్చు హిమాద్రి; నీగిరినొ ద్వం।ద్వోపప్లవం బింత గ
ల్గక నిర్వేదయు సంతసిల్లు ఋతుసా।కల్యోదయన్నిర్వృతిన్. 64

ఉ. చుట్టును దెల్లరా తళుకు । సొంపులు నింపఁగ మధ్యనూత్నముల్
దట్టములైన మబ్బుల వి।ధంబగు కానల కోనలూని యీ
గట్టులమిన్న భస్మపుని।గారపుఁ బూఁతలఁ దెల్లనై మెయిన్
గట్టిన నాగబంధముల । నల్లన యైన త్రిశూలిఁ బోలుఁ దాన్. 65

చ. వికసిలు తమ్మిపూలు కను।విం దొనరించెడు రెండుగట్టులన్
బ్రికటిత మౌ నదంబులఁ గ।రంబును దోఁగి శ్రమంబులాఁగి స్వ
ర్ణ కృత విభూషలం దొడిగి । నాణెపు శైశవమద్య మాని పొ
త్తికత పయంటలన్ దొలఁగఁ । ద్రోతురు యాదవవీరకుంజరుల్. 66

చ. మలఁగల వెండిగోడల స।మంచిత దర్పణ నిర్మలంబులం
దలమి తమోహరార్కకిర।ణావళి యవ్వల వెన్కనున్న ను
జ్జ్వల వసు కందరంబులను । బర్వఁగ నయ్యెడ వల్వ జాఱు యో
షల కుదయింపఁ జేసెడిని । సమ్ముఖుఁ డయ్యును హేళి లజ్జలన్. 67

* ఉ. ఈగిరి సీరపాణి ధరిఽయించిన చేలమువోలె నల్లనై
వేగయు తానిలాహతి దిఽవిన్ భ్రమియించుచుఁ దుంగశృంగరా
జీగతి నొప్పు మబ్బుగమిఽచేఁ బొలుపొందుచు సంభ్రమాన న
భ్యాగతుని న్నెదుర్కొనఁగ ఽ నాఁదట లేచుచు నున్నటుల్ తగెన్. 68

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
రై వ త కా ద్రి వ ర్ణ నం బు ను దా రు కుఁ డు
రైవతకాద్రిని వర్ణించుటయు ననెడి
చ తు ర్థా శ్వా స ము
స మా ప్త ము.

—*—

* ఉ. ఈగిరిరాజు కానఁబడెఽ ని త్తటి నీగతిఁ జేరినట్టి య
భ్యాగతు ని న్నెదుర్కొనఁగ ఽ నాత్రముతో శిఖరాభమై మరు
ద్వేగవిధూత మౌటదిరి ఽ వ్రేలుచు సీరి ధృతాతినీలవా
సోగతి ఁగ్రాలు మబ్బుగమి ఽ సొంపెసలారఁగ లేచెనో యనన్.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

[శిశుపాలవధమహాకావ్యము.]

## పంచమాశ్వాసము



—* స్కంధావారసన్నివేశాదివర్ణనము *—

చ. ఇటువలె దారుకుండు వచియించిన పల్కులు సూనృతంబులై
పటుగతిఁ బ్రేయసీ సదృశభావము నొందుచుఁ జారుమాధురీ
పటిమను గర్ణపేయముగ భాసిల శౌరియు సాంద్ర కాననో
త్కట తట భూధరంబునను దా విహరింపఁగ నెంచె నయ్యెడన్. 1

మ. ద్విపరాజంబుల వైజయంతులను భూవిస్తార సంవ్యాప్తులన్
సుపరీతం బగు పద్మనాభు బల మక్షుద్రంపు శృంగంబులన్
విపులాంచత్కదళీ వనావళుల నుర్వీ విస్తృతి వ్యాప్తులన్
సుపరీతం బగు కొండ యండఁ జనఁగా శోభిల్లు మార్కొండయై. 2

మ. అల భాస్వత్కర మంబరాంతముల నల్లల్లన్ స్పృశింపన్ హరి
ల్లలనల్ "లోకులు తమ్ముఁ జూతు" రని మందాక్షార్తితో ముగ్ధలుం
బలె సేనల్ చను త్రోవ రేఁగి కడు సాంద్రం బౌ పరాగంబు ను
ష్ట్రిల సత్కంఠ కడారువున్ బయి సమాచ్ఛాదించుకొం ద్రొయ్యనన్

సీ. అలిక మాదిగ దశస్థలములం దెసఁగు నా
వర్తమ్ములే జలావర్తములుగ
రాజ్యాదిశుభఫలప్రదము లై యొప్పారు
ముత్తెమ్ములే యాణిముత్తెములుగ
సొగసు గుల్కెడు మెడన్ సొమ్మై యలరు దేవ
మణిగణమ్ములె దేవమణిగణములు
స్వామి సౌభాగ్య సంవర్ధన గళ రోచ
మానంబులే రోచమానములుగ

తే. విభ్రమ స్ఫుర దూర్మ్మితే విభ్ర మోర్మ్మ
లుగఁ జెలంగఁగఁ బార్శ్వంబు లాగి నలముచు
రయమునఁ 'బెట్టినది పేరు' అయి వెలయుచు
నశ్వసేనలు వార్ధుల ట్లవని నలమె.

తే. కుంభములక్రింద నాటినంకుశముఁ ద్రోచి
కరుణ పుట్ట గిట్టుచుఁ బఱచు కరియు
బరువిలఁబడంగ నెగురుచుఁ బఱచు నొంచె
దారి నొండొంటిఁ దారి భీకరతంబులయ్యె.

తే. చంచలాగ్రపదమ్ము సుచ్ఛలిత చామ
రాభిరామ మౌ నశ్వంబు, నర్థ మిలి
తాక్ష మౌ దంతి నొక గతి నరసె జనము
ప్రీతిఁ గూర్చుఁ గదాః యెల్ల జాతిచేష్ట.

ఉ. వింతగ నవ్వి రాక్కవణి ప్రేక్షకు లెల్లఁ గరేణుభీతమై
గంతులు వైచుచున్ బఱచు గర్దభి వీఁపున జీనువాసి యొ
క్కంతిపురంపుటింతి గళితాంబర మైన నితంబబింబమొ
క్కింతయు మాఱుకోనెఱుఁగకే యిలఁ గూలుటఁగాంచి యెంతయున్

తే. నగము ప్రాంతపు, నేల పై నడచు తేర్ల
చక్రధారల నలఁగు ప్రస్తర రజముల
నాదుకొని ధూరజము మింట నబ్దము అయ్యు
ఖర తనూరుహ ధూసరకాంతి మించు.

తే. గొరిజ తాఁకిడిఁ జెదర ఖుజ్ఝురులు పలక
దేరు రానేల పొంతల దారులందు
వారువంబులు పేరెముల్ వాఱు గిరిని
డోళ్లు వాయించునట్లు చప్పుళ్లు పొదము.

తే. ద్వివిధవేగమ్ములన్ మూన్చి తీర్చి సమత
మువ్విధంపు కశాఘాతముల నెఱుంగు
రౌతు నడిపించు నౌరః యారట్టజమ్ము
లితపౌరుష్య మర్ధపులాయితంబు.

ఉ. యాదవసేన లగ్గిరి విహారము సల్పెడి తావులందునన్
మీఁదికి లేచు ధూళితతి నింగిఁ జరించి హిమంబు వైఖరిన్
బై దలిపించు కన్గవల పక్ష్మపుసాంద్రత లిన్మడింపఁగాఁ
బ్రోది యొనర్చి మేలిమురువుల్ గనె దిఙ్ముఖపాళిఁ గప్పుచున్. 11

మ. కరికుంభంబులఁ జీల్చుచోఁ దగులు ముక్తారాశి గోర్సందులం
దిరవై యుండెడి సింహసంహతుల నెంతే శత్రులం బోలి తెం
పరులై చంపిన రాలు ముత్తెములు గుప్పల్ గుప్పలై యొప్ప ని
ల్చిరి యద్రీంద్ర గుహాగృహంబులను జక్రివ్యూహవీరోత్తముల్.

చ. ముకుకొన బట్టినంత గడుమూర్చిలు సర్పము సాంద్రపంక యా
వక రమణీయ కాంతులను భాసిలి వ్రేలెడి పుచ్చు మొప్ప ది
వ్యకళ రచింపఁ బడ్డ విహగాధిపు చిత్రము గల్గు టెక్కెమున్
బ్రకటముగా గ్రహించి హరి పజ్జ బసల్ దిరన్యభూపతుల్. 13

మ. జనముల్ చేరిన తావులన్ దరుమహాచ్ఛాయాసుఖం బున్న ముం
దునకున్ సాగు మఱింత సౌఖ్యముల నెంతో మంచి తా వబ్బు నం
చును లో నెంచుచుఁ బ్రస్తుతాశ్రయము త్రోచున్ లోక మత్యంత మొ
య్యన నాగామిసుఖాభిలాషఁ గల మాహాత్మ్యంబు సామాన్యమే!

ఉ. ముందుగ నేఁగి యొక్కఁడు చమూచరుఁ డర్హనివాస మొక్కఁ డా
నందము మీఱఁ గాంచి జతనంబునఁ బిల్చిన వేఱ యొండు తా
వొందఁగఁ బోవు సైనికుల యుద్ధతి కాకులుఁడై ప్లుతస్వరం
బొంది స్వకీయులన్ బిలుచు నుద్యత బాహువుతో దవిష్ఠుఁడై. 15

చ. వనతరువుల్ వదాన్యతరు వారము కాకయుఁ బ్రోవఁ జాల ద
ప్పిన హరి సైనిక ప్రజకుఁ జిత్త మెలర్ప శ్రమంబు వాపి కూ
ర్చెను సుఖమున్ సుధా రస నిషిక్తము లైనటు చిత్ర మౌ ఫల
ర్ధిని విటపార్పితాంబర పరిష్క్రియ లిచ్చెను గల్పకంబులై. 16

ఉ. పల్లకి మున్నుగాఁ గలుగు వాహనముల్ దిగు భూమిపాల సం
ఫుల్లసరోరుహాననల మోముల మేలి ముసుంగు జాఱఁగా
నుల్లమునం భయోత్సుకత లొప్ప క్షణం బరయంగనేర్తు రం
దెల్లరు దవ్వు పొందని వచించెడి కంచుకి గన్మొఱంగుచున్. 17

ఉ. అంతిపురంపుటింతుల హ॥యంబుల జీనులనుండి దింప న
త్యంతనియోగముల్ బడయు॥ నాయధికారులు మార్దవాత్తబా
హ్యాంతరముల్ స్వకంఠముల॥నంటఁగఁ గొఁగిలి నొంద స్వచ్ఛసు
స్వాంతపవిత్రు లౌట మఱి॥యయ్యెడ ముద్దిడుకోరు చెక్కులన్.

మ. పలు వన్నెల్ గల పూలదండ లమరింపన్ జూడ జానైన చం
చలనేత్రా కబరీభరంబు నొక వృక్షచ్ఛాయ నీక్షించి నె
మ్మి లసత్పింఛపరాభవార్తి గని భూ॥మీజాగ్రమున్ వీడి ద
ప్పులఁ బాఱెన్ గుణిపజ్జ నీర్ష్య గల యల్పుం డెన్నఁడే న్నిల్చునే?

చ. నిగనిగలాడు క్రొంబసిఁడి॥నిగ్గుల నల్లడ విస్తరింపఁగాఁ
దగి యురువంశకేతనవి॥తానము నింగిఁ జెలంగు గబ్బిమ
బ్బుగములఁ దాఁకు నున్నతులఁ॥బొల్పగు తేరుల బారు లొప్పె బా
గుగ నల కొండదండ నెల॥కొన్న యలంతులు గుండులో యనన్.

ఉ. ఛాయలఁ జిమ్ము చున్నతు లెసంగఁగ సంతతభూతిరేఖలన్
బాయక యాణిముత్తెముల॥బారుల తీరును గైరికాది సాం
ద్రాయతరక్తిమల్ వెలయు॥యాదవనాథుల బల్గుదారు లు
చ్ఛ్రియ సమంచితమ్ము లగు॥సామజరాజములట్ల రాజిలెన్. 21

చ. కరము పటీకుటీరములఁ॥గట్టిన కాండపటాళిసందులన్
జొరఁబడు గాలి రివ్వల వి॥సుళ్లను జెమ్మట బిందులాఱ, రా
జరమణు లంత నిద్దుర లె॥సంగ సుఖంబులఁ బారవశ్య మొం
దిరి నునుఁబచ్చికల్ సహజ॥నిర్మలశయ్యలు గాఁ దనర్పఁగన్. 22

ఉ. చెమ్మట లూరఁగాఁ దడిసి॥స్వీయకథావళి విస్తరించు స్వీ
య మ్మగు రైక గోటికొన॥లైన క్షతంబుల రేఁప నూడ్చి చో
ద్యమ్ముగ బాహుమూలకుచ॥దర్శన మిచ్చు కృశోదరీలలా
మమ్మను నేత్రపర్వముగ॥ మ్రాన్పడి చూతురు యౌవనోద్ధతుల్.

ఉ. దం డటు లయ్యెడన్ విడియఁ॥దత్క్షణ మావణికుల్ చొకాటపున్
నిండు గుడారముల్ నిలిపి॥నేటగు బాటకు రెండు ప్రక్కలన్
మెండగు వస్తుజాతులను॥మించు బజారుల వేయు వేలుగా
నుండెడు ఫక్కి నేర్కొలిపి॥రుత్సుకులై క్రయకుల్ భ్రమింపఁగన్

మ. "ఫల మల్పంబు శ్రమం బనల్ప" మనుచున్ భావింప కే మట్టి యుం
డలుఁ గజ్జల్ గొని జట్టు చుట్టు నిలువన్ దద్భీతిఁ గుందేలు ప్రాఁ
కుల మధ్యంబున నుండి దూఁకఁ గని యొక్కొం డప్డు వారించి వా
రలఁ గారుణ్యము మీఱ నా శశకమున్ రక్షించె మెచ్చన్ జనుల్. 25

చ. విడిదల చెంగటన్ బెదరి వేగమ పర్విడు లేడి వెన్క నె
వ్వఁడు విలునమ్ముఁ బట్టి చన వాంఛయునుం గొనఁ డట్టులైనఁ దా
నుడుగదు లేడి పర్వ, వర యోధలతాంగుల వీనులంటఁ బ
ర్వెడు కనుచూపు తూపులకు స్వీయదృశాపజయంబు నెంచెఁ బో! 26

ఉ. త్రోవ జనించు నాశ్రమము ద్రుంగునటుల్ పడకింటి సెజ్జ ని
ట్టే వెలయించి సొమ్ములు వడిన్ దొడి కట్టి ప్రసాధితాంగులై
రో వెలఁదుల్ విడెంబులు విరుల్ వగ నిచ్చి చిరానుషంగు లౌ
భావుకులన్ బలెన్ స్వవశవర్తులఁ జేసిరి పూరుషావళిన్. 27

ఉ. తోఁగిరి వారిఁబట్టి దగ డోసిలి ద్రావి విశుద్ధిఁ జేయఁగా
సాగిరి మేలివస్త్రముల సారబిసంబుల మెక్కి రంబుజ
శ్రీగరిమంబు లౌదల ధరించిరి యోధులు "పర్వతాపగా
పూగసమృద్ధి వ్యర్థ" మను పూర్వుల మాటల పీటఁ బుచ్చుచున్.

మ. నెలలన్ బుట్టు చలత్ప్రవాహజలముల్ సీమంతినీ సానుభూ
తల సంకాశ నితంబసేతువుల రుద్ధం బౌచు దన్నిమ్న నా
భుల నిల్పందుచు వారి మస్తుకములన్ మోఁగింపఁ ద్రుళ్లాడు మాం
సలవక్షోజము లందు దూఁకి పడుచున్ జాల్వారె మందంబుగన్. 29

చ. తనువులు భార మంచనక దవ్వున కేఁగినఁ బుట్టు గాసిఁ బై
కొను నెఱ యూర్పుతో వెడలు కుంభగతం బగు మౌక్తికవ్రణం
బనఁగఁ గరాగ్ర మెత్తి కల యంగను జల్లెడు నీటివానలన్
గొనకొని మేనులన్ దడుపు కొంచు సుఖించును దంతియూథముల్.

మ. చెలువుల్ మీఱు కుథాద్యలంకరణముల్ జెండాలునున్ డించినన్
బొలుపున్ గాంచు చమూమదావళము లై కమున్ తెక్కలం గాదుకో
జలధిం బడ్డ గిరుల్ పవి క్షపిత పక్ష శ్రేణు లైనట్టి కొం
డలునుం నేఁడు జనించె నేమొ సరసీ స్నానేచ్ఛ నా నొప్పెడిన్. 31

—* గజవర్ణనము *—

చ. అలఘుసరోవరంబున మహోరయయుఁ దత్తరంగమందు ను
జ్జ్వల మగు నైజరూపమె వెసం గని తన్నెదిరింపవచ్చు నే
నుఁగుల యొకిమీఁదటంచు భ్రమఁగొంచును వారణసార్వభౌముఁ డ.
గ్గుల వెలిగ్రక్కు చూడ్కి నుఱుకన్ గన నయ్యది యుక్తమే కదా!

చ. పరగజదానదుష్ట మని వారిని ద్రావదు, తృష్ణ హెచ్చుటన్
గరము పిపాస వీడ్కొనదు, కాలు మెదల్పద, యంకుశంబు చే
చ్చెరఁ బడఁ జిమ్మ నిప్పుకలు చిందఁగఁ జూచు నొకేనుఁగు నీరు గ్ర
చ్చుఱఁ గొనవచ్చు వారు పెలుచన్ బలవన్ జలధి త్రపాత్రుఁడై. 33

చ. "కుటిలశిరోజ చూడు మదిగో యొక దంతివిభుండు దారి ప
ర్యటన మొనర్చి నీరుచము లారసి వాని పరేభకుంభపుం
దటము లటన్న భ్రాంతి కరతాండవమున్ బొనరించుఁ బోకు మ
చ్చట" యని మాన్తురయ్యెడలఁ జానల మేలము లాడుచున్ విటుల్.

ఉ. దిక్కరిరాజి గెల్చి గడిదేఱిన వారణరాజ మొండు దాఁ
జిక్కు మదార్తిఁ బాపుకొనఁ జేతను బట్టుచు నీరు పై పయిన్
జిక్కిలి జాలిఁ జల్లుకొను మేదురలీలలు రెల్లుపూల స
మ్యక్కలితస్వరూప మయి మానితచామరసామ్యమున్ గనున్. 35

ఉ. ఒక్క మదావళంపుమద మొప్పెడి గాలి మెయిన్ స్పృశింప నీ
నెక్కి మఱొక్క యేనుఁగు గన కిట్టటు పుక్కిట నుండు నీరముల్
గ్రక్కున ధూత్కరించి మును ప్రతిమానములైన కొమ్ములన్
దిక్కకొలంది నాజలధితీరము గ్రుచ్చుచు వ్రాలె నేలపై. 36

చ. ఉరుతరదానపూర్ణుఁ డగు నొక్కఁడు ముక్కిడి యై జడాల్పధీ
పరివృతుఁ డైన వానిదగు పజ్జల నిల్వ నెవండు గోరు? ను
ర్వర మరియొండు చోట నిలువం జనుఁగాని జలాలఁ డోఁగఁగాఁ
గరి యరుదన్ మిళిందతతి గండము వీడ్కొని నిల్చె నింగిపై. 37

తే. పీట నేనుఁగు మునుగంగఁ దేఁటిదండు
గండయుగళి విడచి యట్టె యుండె దివిని
గుణిసమాశ్రితం బైనను గుణము సతము
నీలవర్ణము వేర్పడి నిలిచి నట్లు.

చ. జలము విహారమందిరము, సామజపుంగవుఁడున్ సరిన్మణీ
లలనయు దంపతుల్, మమతలన్ విహరింప యథేచ్ఛ లీల ను
జ్జ్వలగజకాయ గైరికసువర్ణపటంబు గొనున్ స్రవంతి; త
జ్జలజపరాగయుక్త మగు సన్నని చేలము దంతి గైకొనున్. 39

చ. సలలితధారగా మదము జాల్కొను నేగ్గు మదంబు లేఖలన్
గలియుచు మండలాకృతులు గాంచుట నయ్యెడ నేత్రపంక్తి యొ
ప్పులు గనె; నీటఁ దోఁగి తటముల్ గజ మెక్కెడు వేళ నల్లగ
ల్వలు మెయి నంటఁ దోఁచెఁ "గనుఁగలన్ గొనె మాఱుగదాను"
నన్నటుల్. 40

ఉ. వైరముతోడ నన్యకరి పైఁబరువెత్తెడు దంతి నాఁపఁగా
సారతరాంకుశంపుఁగొన జయ్యన లోఁతుగ నేత్రగోళమున్
జేరఁగఁ గ్రుచ్చి యైనఁ గరి నిల్పఁగఁ జాలఁడు మావటీఁడహో!
శూరులు సాహసంబులకె బొత్తురుగా పరు లెంత యడ్డినన్. 41

చ. చనవున బుజ్జగించుచు నిషాది యొకం డొక యేన్గుఁ గట్టఁగా
నను వగు చెట్టునీడ కెలయన్ జనఁ ద్రోలఁగ నన్యహస్తి వా
సన యటఁ దోఁచి, నిల్వ కల సాలము భగ్న మొనర్చి వేసెఁ గి
న్క నెనసి, యెయ్యెడన్ బరులగంధము మానధనుల్ సహింతురే?

చ. గిరివరకాననంబులను గ్రీడకు నై విహరించు వన్య మా
కరివర మొండు చెక్కిళుల కండువు వోఁపఁగ రాయఁ జిందు బం
ధురమదవారి వర్ధిలిన తుంగమహీజముఁ గూల్చె సైన్యపుం
గరి విరు లెల్ల వాడ, నళికాండము లేఁగి చనన్ యథామతిన్. 43

ఉ. అల్లనఁ జేరి భూరుహాశిఖావళి మేయఁగ మాన్ప రాక రా
గిల్లు మదేభయూథము స్వకీయ నియంతృనిదేశ శక్తిఁ గం
పిల్లుచు మూలశాఖలనె పెంపఱఁ ద్రుంచు స్వబంధనార్థమే
యెల్లెడ మత్తులౌ జను లొకింత యెఱుంగర యాత్మనీనముల్. 44

ఉ. వెచ్చని శీకరంబులను వే విడఁజాలిన పేఁడి లోపలన్
బెచ్చు పెరింగియుండ నవనీలసరోరుహకాంతి పైపయిన్
హెచ్చుగఁ బర్వఁ బెద్దతలలెత్తెడు నాగములందుఁ గొన్నిటిన్
గ్రచ్చుఱఁ దోలి కొన్నిటిని గంధపుమ్రాఁకులఁ గట్టి రా భటుల్. 45

చ. గమగమలాడు నాము గల గండతలంబులఁ దీటఁ దీఱ వృ
క్షముల ప్రకాండకాండముల సామజముల్ కడు రాయ నాసుగం
ధమునసఁ గొమ్మలన్ విడిచి దంతుల గొంతులఁ గ్రమ్మి యింద్రనీ
లమణులఁ గూర్చు హారములలాగునఁ దుమ్మెదబాలు గిల్కొనెన్.

శా. కాలందన్నుట సిప్పు గ్రుచ్చుట, యెఱుంగంటోని యొక్కొదువ
ర్షా లీడొందిన గున్నయేనుఁగును శాస్త్రప్రోక్తశిక్షావిధా
నాలన్ దర్జనభర్జనాదుల నధీనం బొనటుల్ చేసికోఁ
జాలెన్ మెల్లఁగ యంత; సిద్ధి నిడదే శాస్త్రంబు ధీశాలికిన్. 47

తే. తొంటి యున్నత స్తంభంబుఁ బొలఁగ విడిచె
సరసహస్తాగ్రదానం బొసంగఁ దెగియె
నపరబంధనశృంఖలా లపనయించెఁ
బృథుతర స్వేచ్ఛఁ గాంచెఁ గరేణురాజు. 48

తే. కుపితుఁ డౌ మావటీనిచేఁ గ్రూరశిక్ష
లందియును గన్ను మూసి సుంతైనఁ గవణ
మారగింపద కడఁక గంభీరవేది
"మందుఁడును బల్మి లొంగఁ" డన్ మాట లేదె? 49

ఉ. సంబర మొప్పఁ గైకొనదు సమ్ముఖమం దిడినట్టి యిక్షుకాం
డంబుల నల్లనల్లఁ దను దగ్గఱి వేచిన తత్కరేణుర
త్నంబును నోరగంట నయి నన్ గన దక్షుల మూసి హస్తి దెం
దంబున నిల్పుఁ దా మును పొనర్చిన స్వైరవనీవిహారమున్. 50

శా. ఉత్తుంగాగ్రశరీరి యొక్క కరి యుద్యోగింప దంతేని మేల్
బత్తెంబున్ గొనువేళ వంగుట కటన్ భక్ష్యప్రదుం డాకడిన్
బత్తిం జేనిడి బాహు వెత్త ఘృతముల్ జాల్వాఱుచున్ జాఱిన
మ్మత్తేభంబు గ్రహింపఁ జేసెను గడిన్ బ్రాప్తామితక్లేశుఁడై. 51

ఉ. తెల్లని యంశుకంబులను దీర్చిన కప్పులు రశ్మిసంతతుల్
మొల్లముగా ఘటింపఁ బడి ముచ్చట లీను నరేంద్రవాసపుం
గొల్లెన తెల్ల నీలఘనకుంజర మండల కాంతిశోడశో
భిల్లెను నీలమేఘ పరివేష సమంచిత చంద్రులుం బలెన్.

—* అశ్వవర్ణనము *—

కం. గతిజితమారుతము లయ్యును
గతబహుమార్గములు హరు లఖండ స్వేద
స్రుతిసిక్తవార్ధిపల్యయ
నతనువులై భువిఁ బొరలి యణంచుకొను శ్రమల్. 53

ఉ. వంచి శిరంబు బాహ్లిజపువార్వము వాసనలన్ గొనంగఁ గ
ల్గించిన యూర్పులన్ బలసి లేచిన సన్నని ధూళిరేఖ య
శ్వాంచితకాయసక్తి నుదయం బగు భూ లల నాంగ జాత రో
మాంచ మొకో యనన్ గనఁగనయ్యెను జూపఱ కద్భుతంబుగన్.

ఉ. బంగరు సైకతస్థలిని బాగుగఁ దాఁబొరలాడి వాజి స్వీ
యాంగకముల్ విదిల్చి, మెడయందలి యాయతమైన జూలు ని
క్కంగను విప్పు వేళఁ గడఁకన్ స్ఫురదాంతరతేజ మింగలం
పుంగణరాజిఁ గ్రక్కు ననఁ బొల్పుగఁ బర్వె సువర్ణ రేణువుల్. 55

సీ. వక్షంబుపై మోముపై శుభంకరము లౌ
సుడి తీరు లరదోఁపఁ బొడుచు భాను
విధమున మెఱయ శ్రీవృక్షకి సంజ్ఞఁ జె
న్నారు నొక్క తురంగ మావతంస
మగ్ర పాద మొకండ యవనిపై నెలకొల్పి
యగ్రకాయంబు మిన్నంద నెత్తి
పురుషకాహ్వయమున వరలు స్థానకమున
నిశ్చలాంగముల నిర్ణిద్రవృత్తి

తే. నుండియును గళ్లియపుఁద్రాళ్ల రెండు హస్త
ములను బిగియించి పట్టిన ప్రౌఢ రౌతు
నింతయును ధిక్కరింప వలంతిగాని
దాయె "రౌతు కొలంది హయంబు గాదె" 56

ఉ. స్నానజలార్ద్రమై నునుపుఁజాయల కాయముతోడి యున్నతం
బైన మహాశ్వ మొండు గన నయ్యెను సాగరజాత మౌ శచీ
జాని హయంబు గేరుచును స్వర్గనివాసులఁ బోలి యెల్ల ర
ద్దానినె చూచుచుం ద్రుకనుదమ్ముల మూయక విస్మయంబుతోన్.

ఉ. ఇంచుక ప్రోఁతకే నిదుర యేదుచు మేల్కొను భాగ్యలక్షణో
దంచిత లౌ నృపుల్ హరు లపాంతతృణంబుల మేయు వేళ గ్రీ
వాంచల ఘంటికా కిణకిణారవ సంమిళితంబు లైన య
ధ్యంచిత దంత చర్చుర రవమ్ముల విందురు కౌతుకంబునన్. 58

* చ. హయ మొకఁ డాత్మదర్పమున నయ్యెడ రజ్జువుతోడ శంకువున్
రయమున లేవనెత్తుచుఁ గురంగము వేగముతోడఁ బర్వ నే
నయవిదు లాపఁజాలరు; ఘనం బగు వేఱొక వాజిఁ గాంచి య
శ్వ యని భ్రమించి దానికయి పర్వఁగఁ గుందుదు రెల్ల సైనికుల్.

సీ. పదునాల్గు తెఱఁగుల వాగెల తత్తత్ప్రి
యోగంబు లాఱు ధీయుక్తి నెఱుఁగు
సాదిమిన్న యొకండు చతురచతుర్విధ
ముఖసిద్ధు లందు సంపూర్ణ శిక్ష
ణంబు నొందినది, భయం బెఱుఁగనియది
పల్లంబు మొదలౌ సపరణ లెల్ల
నమరింపఁబడి యోగ్యమైనదియును నగు
నశ్వంబు, యుద్ధాది కవల నేర్వ
తే. వలయు వల్గనముల నెల్లభంగు లొకటి
నొకటి గలియని విధములు; నోర్చి త్రొక్కఁ
బ్రకటనవమార్గములలోన బహువిధములఁ
దివిరి నడిపింపనేర్చె నయ్యవసరమున. 60

ఉ. ఇచ్చకు వచ్చునట్లు చరియింపఁగ విప్పిన వాజు లెల్లెడన్
బచ్చిక మేసి యాశిబిరపార్శ్వములన్ జరియించి దూష్య త్వ
ట్యచ్చరపాశలగ్న మగు టారసి సాదులు మాన్ప నల్గఁగా
గ్రిచ్చర పీడుచున్ శిథిలరజ్జుపదంబులతోన నేఁగెడున్. 61

---

* ఉ. త్రాడులతోడఁ గంబమును దప్పున మీఁదికిఁ బెల్లగించి మై
వాఁడితనంబుఁ జూపి యొకవారువ ముద్ధతి బర్వి బట్టఁగా
నోడుట కాదదే పఱచుచున్న మహోక్ష హయంబు జూచి బల్
గోడిగ యంచు వెంటఁబడు గోలను గాసిలి రెల్ల సైనికుల్. 59

అని పాఠాంతరము.

—* వృషభవర్ణనము *—

చ. బరువులు డింపఁగా లఘుత భాసిలి స్వాదుమృదూలపంబు మే
సి రహిని గుఱిలో బరువు చేకుఱ మత్తిలి చర్వణాప్తి మై
నురగలు గంగడోలు పయి నూల్కొనుచుం బ్రవహింపఁ గన్నులన్
గరమును మూసి యెద్దులు సుఖంబుగఁ గూర్కొను జెట్ల నీడలన్.

మ. బలదర్పంబులతో మహోక్షములు వప్రక్రీడ గావింప ని
మ్ముల యగ్రంబుల మంటి ముద్ద లలమన్ మోమం దసల్ బద్దల
క్ష్మలసద్రూపము గాంచి, యిందునిభమై జానొందు శృంగాల నె
ద్దుల కొమ్ముల్ వడఁగొట్టి పేర్చి యలచున్ దువ్వున్ సరిత్తీరముల్.

ఉ. ఆవును గోరి డాయ నభిహారిమహోక్షము లొక్క పెట్టనన్
జేవను వచ్చి యుద్ధముల జేయఁగ నన్నిటి నోడపుచ్చు దీ
ర్ఘావిల శృంగకేతుయుగ మన్ని దెసల్ ప్రకటింపనో యనన్
గోవు పిఱుందనే యరిగె, గోవిభుఁ డత్తసమస్తశత్రుఁడై. 64

—* ఉష్ట్రవర్ణనము *—

చ. మెడ పొడవౌ ప్రయోజనము మించ లభింపఁగ సాచి కంఠ మ
క్కడఁ జరియించు లొట్టియలు ఖస్థలముల్ స్పృశియించు చెట్టులన్
పొడమెడి లేఁజివుళ్లఁ గల భూరి రసంబు గ్రహింపఁజాలె వ్రే
లెడి పెదవుల్ చలింపఁ బయికెత్తిన మోముల గోము దెల్పుచున్.

చ. నెఱి యలవాటుగాఁ దినెడి నింబదళంబులతోడ మార్దవ
స్ఫుర దరుణామ్రపల్లవము చూడక మ్రింగిన యొంటి తా నని
ష్ఠురతను గ్రక్కె దాని గరుడుం దొక యష్ట కిరాతయుక్త భూ
సురుఁ దిని కంఠదాహమున శ్రోత్రియు మాత్రము గ్రక్కునట్లుగన్.

ఉ. పూవులమాలికల్ వలెను బొల్పు రహించెడి తేటమాట లెం
తే విలసిల్ల గొంతు పయికెత్తి బహిఃస్థితసేవకాళికిన్
భూవిభు చర్యలన్ బ్రజకు మోదముగాఁ బ్రకటింప నేర్తురి భో
గావళి సత్ప్రబంధముల నచ్చటి మంగళపాఠకోత్తముల్. 67

మ. ఒకచో నగ్గిరి నున్నతస్థలముపై నుద్యద్వినీలాంగక
ప్రకటేభంబులు నిల్వఁ దామ్రవసనప్రాంచత్ప్రభామండలిన్
విరచాజ్జాతపటీగృహంబు వెలసెన్ నీలాంబుదశ్యామభా
ప్రకరంబుల్ నెఱ సంజకెంపు రుచులన్ బైకొన్న మిన్నట్టులై

ఉ. "గట్టొక దాని నెత్తి తని రాదె నినున్ బొగడున్ జనంబు న
న్నిట్టుల నేసలం బఱపి యెంతయుఁ గాఱియ పెట్టెదేల నీ
వెట్టిఁడ" వంచు రైవతక మెల్లరునున్ వినఁ గృష్ణు గట్టిగాఁ
దిట్టెను దంతి భగ్న కుజదీర్ఘ రవచ్ఛల నిష్ఠురోక్తులన్.

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
స్కంధావారసన్నివేశాది వర్ణనంబును, గజవర్ణనంబును
నశ్వవర్ణనంబును, వృషభవర్ణనంబును, నుష్ట్రవర్ణనం
బును ననెడు పంచమాశ్వాసము
సమాప్తము.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

[ శిశుపాలవధమహాకావ్యము. ]

## షష్ఠాశ్వాసము



—* షడృతువర్ణనము *—

* ఉ. అంత గిరీంద్రసానువుల§యందుఁ జరింపఁగఁ గోరువాని, స
త్సంతతి కాపదల్ వొడమ§సంతత మారసి ప్రోచువాని, ర
క్షోఽంతకుఁ గొల్వఁగా ఋతువు§లాఱును జేరెను స్వస్వభూరుహా
త్యంత మనోజ్ఞ పుష్ప ఫల§తండముతో భువి నావరించుచున్. 1

—* వసంతర్తువర్ణనము *—

తే. నవ పలాశ పలాశవ§నంబు మఱియు,
స్ఫుట పరాగ పరాగ తాం§భోరుహంబు
మృదుల తాంత లతాంతసం§పదలఁ బొదలు
సురభి సురభిని గనులారఁ§ జూచె శౌరి. 2

తే. అలకలఁ గదల్చి, మృగనయ§నాలికములఁ
గ్రమ్ము చెమ్మట లార్చి, స§రస్సులందుఁ
జిఱుతతరఁగలతోడఁ దా§మరలు విచ్చ
నూఁపి, చెలఁగును జిఱుగాలి§ యుల్లసిలుచు. 3

తే. వెల్లఁదన మొప్పు గోరంట§విరుల నళులు
వ్రాలి నా తేంట్లు నల్పులు§ వరలె; శౌరి
చెలుల కనుపాప లందలి§ నలుపుఁ బోలె
గుణవదాశ్రియాప్తర్థులౌ§ గుణము లగుట. 4

---

* ఉ. ఆతఁడు ముందు గాంచెఁ జిగు§రాకులఁ దాల్చు పలాశకాననం
బాతత రేణు యుక్తజల§జాళి, నభోగతభాను భామజా
తాతపతాంతకోమలల§తావళియున్ గడు ఘ్రాణతర్పణం
బై తగు పూవు తావుల ప్రి§యం బగునట్టు వసంతకాలమున్.
అని పాఠాంతరము.

తే. స్వర్ణకాంతుల సంపఁగుల్ - ప్రజ్వరిలఁగ
నడుమఁ గంకేళికుసుమము - లనంగదహన
కపిశితం బయి స్పష్టమై - గానవచ్చు
విరహిజనభిన్నహృదయస్థ - పిశితము వలె.

తే. మావులను రాలు పుష్ప - రజోవితతులు
స్మర తుషానల కణ సము - త్కరము లగుచు
నచట విహరించు పాంథుల - కధిక తాప
కరములై యేఁచు వెల్లెడఁ - గరము మెఱపి.

తే. ప్రియతములఁ బైనఁ గోపించు - మృగవిలోచ
నలను బ్రతిమాల మఱఁ దంపు - చెలు లనంగఁ
బొగడపువు మద్యములఁ ద్రావి - సొల్పు మీఱు
గానముల మించె మధుపాళి - యా నగముల.

క. కట్టలుక దీర్ప నెచ్చెలి
గుట్టున వచియించునట్లు - కోకిల గూయన్
బెట్టెల్ల విడిచి కోపన
యట్టే తన మేను ప్రియున - కర్పణ చేసెన్.

క. పరివాదినీస్వరాతి మ
ధురగాన మొనర్చి యళులు - తుంటవిలుతు సా
మరి వశపఱుచును విరహుల
హరిణంబుల మోసగించు - వ్యాధతతి వలెన్.

ఆ. పూలఁ బుఱుకఁ జేరు - పూఁబోణి తన చేతఁ
బట్టి దివియ సుంత - వంగకుండె
విటపిరాజు; పుంస్త్వ - మట మట మైపోవఁ
జెన్ను గనునె యలఁత - దున్నతియును.

క. కుచజిత కుసుమగుచ్ఛా!
ప్రచురానత నవలతావ్రాతాగభరనతా
జ, చయాంచితరాగము పీ
డ చంచరీకములు బర్వోక్తిడిన్ నీ కెదురై.

శా. కాంతానవిశ్వసితంపు సౌరభము గ । ల్గన్ నీదు కెమ్మోవి న
శ్రాంతం బూరు సుధామధూత్కరము లి । చ్చన్ గ్రోలఁగాఁ గల్గ నా
వంతేఁ బూలురియించు తేనియల పై । నందొప్పు నెత్తావి పై
స్వాంతం బేఁగునె నీకునుంబలెను జం । చ చ్చంచరీకాళికిన్. 12

ఉత్సాహ:- ఇటులఁబ్రియము వలుకు ప్రియుని । నింతి రెండు చేతు లె
త్తుటను బసలు దెసలఁబరువ । తుంగతర కుచోల్లసత్
తటములానఁ గౌఁగిలించె । దయిత రభసమునఁ దనం
తటనెయళికిఁ దలఁకి నటులు । దరవశు ల్చెలంగఁ గాన్. 13

ఉ. ఆననసారసౌరభము । లాను పనిం బలు తేఁటిమేటి లో
నూనిన యాస డాయ భయ । మొంది తటాలున నింతి యోర్తు సం
దానితమేఖలా రణిత । నవ్య కలక్వణ కింకిణీ కిణ
ధ్వానము లీనఁగా నడచెఁ । దాఁ జలి తాలక రుద్ధదృష్టి యై. 14

తే. పతులె తొల్త న పల్కుల । పరిణతి సేయ
గరువమున వారిఁ గన్నెత్తి । యరయ నట్టి
మంద ప్రోయాండ్రు తామె యా । మతి చెలంగఁ
బతులఁ జేరిరి మదనార్తిఁ । బట్టలేక. 15

తే. తియ్యవిల్తుఁడు వింట సం । ధించి విడువ
రుంయి మని వ్రాలు విరి యమ్మ । రుంతుదముగ
మేనఁ గ్రువ్వఁగ స్మృతి దప్పెఁ । జానల కని
నుడువఁగా నేల పెక్కురు । మడసిర యన. 16

ఆ. నెలఁత నీవు కంట । నీర్వెట్ట మొగ మింత
కగ లేదు పొగను । తగ లేదు
కాని యిట్టి సురభి । కోలానఁ గన్నీ ర్తొ
అంగు కంటె నెది య । మంగళంబు? 17

తే. "విడుచు నసువుల వైళమ । విరహవేద
నాధికత నీపె" యంచు నీ । యాప్తు లెల్ల
నిన్నుఁ బ్రేమించి యందురే । నీవు వారి
పలుకులు నిజ మ్మొనర్పు కో । భాగ్యరాశిః 18

ఉ. దూరగుఁ డయ్యు లేమ దయి§తుండు వసంతమహోత్సవావధిన్
మీఱక వచ్చితీఱు నని § నెచ్చెలు లూఱడఁ బల్కుచుండ నే
దారునఁ జేరు కాంత విశ§దస్వర మంతల బొంతలన్ వినన్
రా రమణీలలామ కదె § కర్పిన్న సుధారస మై సుఖం బిడెన్. 19

విశేషకము.

చ. అలఘుమధుప్రబోధితము § లై చెలు వొందెడి మాధవీసుమం
బులను దొసంకు తేనియల § బొజ్జలు నిండఁగఁ ద్రావి క్రొవ్వి శో
భిలు మధుపాంగనల్ నవన§వీన కలధ్వను లీన దర్పక
జ్వలనము ప్రజ్వరిల్లునటు § పాడెను మై మఱువంగ నెల్లరున్. 20
ఆ. పాంథగణము మిగులఁ § బరితాపములఁ గుంద
శైలవనము లెల్ల § జాజువాఱఁ
బువ్వులెల్ల బలసి § మోదుగుచెట్టుల
విరిసి వహ్నిలీల § మెఱయఁ జొచ్చె. 21

—: గ్రీష్మర్తు వర్ణనము :—

చ. దిరిసెనపూవుగుత్తులను § దీపిలు పుప్పొడి రేఁగి యుష్ణరు
త్తురగ తనూరుహచ్ఛవుల § తోఁ దులఁదూఁగి చెలంగ మల్లికా
స్ఫురిత లతాంత సంకలిత § మోహన సౌరభ బంధురంబు గ్రీ
ష్మఋతువు గ్రమ్మఁజొచ్చెను గ్ర § మమ్ముగ నిమ్ములవిశ్వవిశ్వమున్
తే. లలితపాటలకుట్మలం § బుల నగించు
చాత్మకాంతల యూర్పుల § ననుకరించు
చళులు మత్తిలి చెలరేఁగి § యాడఁజేసి
వన్నెకాండ్రన్నుకొన గ్రీష్మ§వాయు వొలసె. 23
ఉ. చల్లని నీట దోఁగి కుచ § సంగతవారికణంబు లొప్పఁగాఁ
గిళ్ళు నొసంగి తజ్జలము § కేవలమాఱినఁ జూచి చేతులన్
జల్లని మంచిగంధపుర§సంబులఁ జల్లుచుఁ జల్వఁ గూర్చుచున్
బెల్లు సుఖింపఁజేసిరి త§మిం బ్రియులన్ బ్రియలట్టు వేసవిన్ 24
తే. చంచలాంచితదీప్తివి§శాలనయన
యగళితోరుపయోధర § యగుచు తానె
వేళ కాకుండ వర్షర్తు § వేళ భూమి
ధరుని గాదంబిని యలఘూ § త్కంఠఁ గవిసె. 25

—: వర్షర్తువర్ణనము :—

ఆ. గజబిడౌజుతేజు ƒ గల గబ్బి మబ్బుల
నింగిఁ జూచి తన యƒనుంగు ప్రియుని
గవియ నభిసరింపఁ ƒ గడఁగ దేపడతి? లోఁ
నల వరింపకుండు ƒ కలికి గలదె? 26

ఆ. హరిధనుర్విలాస ƒ మవఘళించెడి మబ్బు
బహుమణి ప్రదీప్తి ƒ పటల కుండ
లద్వయాప్త శోభƒలను వెలార్చెడి వెన్ను
దివ్యదేహకాంతి ƒ తీరు మీరు. 27

తే. గాలిరివ్వల విరియుచుఁ ƒ గవియు పెద్ద
మేఘములలోన మిలమిల ƒ మెఱయు మెఱుపు
లోలి వాయువిదీర్ణ తƒమాలశాఖి
కలను జెలువొందు పూవు గుƒత్తులను బోలె. 28

మ. తొలి మబ్బుంగని లేమ జీవనమునం ƒ దున్ గల్గె సందేహ మం
చు లతాంగీమణి చుట్టుఁ జేరి పలుకన్ ƒ జుట్టాల నీక్షించి త
జ్జలదాలోకనముం బొనర్చె నది క్రో ƒ ధ క్రాంత దైన్యంబుతో
లలితాపాంగదృగాళిఁ బ్రాణముల ని ƒ ల్పంజాలి యెట్టెట్టులో 29

చ. విరిసిన కందళంబు లొద ƒ వించిన లాలన నుబ్బు మబ్బు ప
య్యెర ప్రవసన్నిజేశ లగు ƒ నన్నుల వంతలఁ గూల్చుటల్ వనా
వళులను బట్టి వంచు టొకƒపాటివె యెంచ మనస్వినీజనం
బుల మదిలోని గుట్టునె సƒమూలము గూల్చెడి చెట్టుముందటన్. 30

ఉ. మృత్తును నీరు బూదియును ƒ మేదిన సంస్కృతి నొందు మద్దెలన్
జిత్త మిగుర్పఁగా వెడలు ƒ స్నిగ్ధ రవంబులఁ బోలు శబ్దసం
పత్తులరించి మేఘములు ƒ మంజుల కేకము లా నెమిళ్లగుం
పత్తతి నాడఁ జేసె హృదƒయంగమసంభ్రమవిభ్రమంబులన్. 31

తే. కడిమిపూవుల పుప్పొడి ƒ గగన మెఱుపు
నేసి చెంగల్వ పూఁదావి ƒ చిలికి యడవి
గాలి యత్తఱి తమతమ ƒ కాంతలయెడఁ
బ్రియుల యెదలఁ గ్రొవ్వలపులు ƒ పెనిచి కలఁచె. 32

తే. వేఁడి చల్లాఱె దుమ్మును ✱ విరిసెఁ గ్రొత్త
గురియు మబ్బులు చిన్కుల ✱ గిరినితంబ
వాసినులు సుఖియించిరి ✱ వసుధ చిమ్మ
తావి మురియింప దుండెడి ✱ తావె లేదు. 33

తే. పెద్దమబ్బు తాఁకిడిఁగొనల్ ✱ విఱిగి దివము
తొలఁగి భువిఁగూలు చలివెలు ✱ తునకఁ బోలి
ద్విరద రదనాచ్ఛరుచు లాని ✱ తేఁటు లంక
భూతమృగముగ వెలుఁగొందె ✱ మొగలిపూవు. 34

తే. పెద్దవెలయేళ్ళ జలబిందు ✱ వితతి నొగసు
దళితమౌక్తికచూర్ణ ధ✱వళిమ చెలువు
పెరుఁగు బిందులతో సాటి ✱ దవిలి యడవి
మల్లిపూవు పరాగంబు ✱ మహిని వెలసె. 35

చ. తొలకరి మబ్బుచిన్కులకుఁ ✱ దుల్యములై మృదులంబులైన జా
జుల విహరింప నందుఁ గల ✱ చొక్కపుఁ బుప్పొడి మేననంట తె
ల్పుల విలసిల్లు నంగములఁ ✱ బొల్పు గనెన్ మధులిట్టు లిట్టటుల్
గలయఁ జరించు చుక్కఁగమి ✱ కైవడి నత్తఱి నేత్రపర్వమై. 36

తే. మగ లెడసినట్టి మగువల ✱ నొగులుచు నవ
నీపవన పవనావళి ✱ నిజ మదేమొ
కాని నిజరజ మలికె బు✱క్కాము వోలె
ధృతజలదవస్త్రలైన ది✱క్సతుల పైన. 37

చ. ప్రణయరుషావిచేష్టలకుఁ ✱ బాల్పడి యవ్వల మోము పెట్టఁగా
ధణధణ మేఘగర్జనల ✱ ధైర్యము జాఱిన యింతి, కాంతుఁదత్
క్షణమునఁ గ్రుచ్చి కౌఁగిలిడు ✱ నందడిఁగుక్షి వళిత్రయంబు పొం
పణఁగి యదృశ్య మయ్యెనదు✱మాయతమౌచు విలాసమొందఁగన్.

తే. "మబ్బుపయ్యెర దాఁకిన ✱ మనసు కలఁగ
కున్నె యెంత విరాగుఁ డౌ ✱ మిన్నకైన
నిక్కమిది" యంచుఁ దుమ్మెదల్ ✱ చక్కఁ జాడఁ
దలిరుటాకులు పలికెన్ను ✱ త్యంబు లలరి. 39

చ. మెఱుపు నెపాన బెగ్గిలుచు ƒ మీనవిలోచన లాత్మనాథునుం
దరరతి మందిరంబులనె ƒ తక్కుచుఁ దారుచుఁ గామవశ్యలై
వరులను జేరి మంతనపుఁ ƒ బల్కులఁ గుల్కుచు నుందు రీ యాదవే
శ్వరవరయూథశూర పరి ƒ వారము చూచి బలేః బలేః యన్. 40

—శరదృతు వర్ణనము.—

సీ. వానకారున ఘన ƒ వారిదబృందము
పాధియై కాలంబు ƒ వరలుఁ గాన
వేవెలుంగు దిగంత ƒ విశ్రాంతఘృణి గాక
నిద్రాయితం బగు ƒ ముద్రఁ గనియె
ఖగగణంబు యథేష్ట ƒ గగన విహార చా
తురిమాని గూండ్లలో ƒ సురిగి యుండె
నాఘనోపాధి వా ƒ యఁగనె కాలము శర
దృతు వౌట రవిదీప్తి ƒ దెసల నలమె
గీ. సకల విహగకులమ్ములు ƒ సర్వది గ్వి
రామముగ సంచరించు టా ƒ రంభ మయ్యె
నంచు హరి పల్కె "నౌరః యు ƒ పాధి మాఱ
నొక్కకాలమె పలు మార్పు ƒ లొందు" ననుచు
సీ. చక్కఁగ వికసించి ƒ సౌరుల మీఱిన
యిందీవరంబులే ƒ యీక్షణములు
తీరు తీరుగ జాలు ƒ తెల్లని మబ్బులే
సన్నని వలిపంపు ƒ సరణు లనఁగ
నొప్పులకుప్పయై ƒ యొప్పు శరదృతు
వాత్మసిరియుండైన ƒ యవనిభృత్తుఁ
జేరఁ దత్తుంగాంక ƒ సీమ పై నెలకొని
తత్ప్రియ సీరూప ƒ ధారిణి యయి
గీ. కన్నులకు విందొనర్చు నీ ƒ కరణి ననుచుఁ
జూచి చూచియు మఱియును ƒ జూచి మురియు
పేరు స్మరియించువారి నె ƒ వ్వారి నైనఁ
బ్రోచువాఁడగు యాదవ ƒ భూషణుండుః 42

ఉ. రేలను మచ్చరించి విహ § రించుచుఁ దమ్ముల తేజుఁ బాపుచున్
గ్రాలఁగ నేర్చు బల్లమము § కంజహితోద్ధురదివ్యకాంతికిన్
నేలఁ జరింపలేక యట § నింగిని వ్రేలును మేఘబృందమై
వ్రీలక నిల్తురెవ్వ రొక § విశ్రుతు తేజము విక్రమించుచోన్. 43

తే. వర్షఋతుకేకి కేరల § పరుసఁదనము
మాని, శారదహంసముల్ § మధుర భాష
ణముల వచియించు సర్వలో § కముల బలిమి
కలిమి లేములు కాలసం§గతము లనుచు. 44

ఉ. హంసవచోఽతి మార్దవజి § తాలఘు కేకశిఖండిబృంద మా
హంసకృతాభిభూ త్యనల § జాంగ మహావ్యధచేఁ దనూరుహో
త్తంసము లూడ్చె శారద వి § ధానము వర్తిలు వేళ విద్విష
న్మాంసలదుష్ప్రరాభవము § మాన్యులు సైతురె భూతలంబునన్. 45

తే. వరపరాగసమేత జ § పాసుమాధ
రోష్ఠ మంజువనీ యోషి § దుజ్జ్వ లాస్య
మందునన్ నీల గోరంట § యలరు లోలిఁ
గ్రమ్ముకొని భాసిలె విలోచ § నమ్ము లగుచు. 46

ఉ. పుప్పొడి హత్త జాజుటికి § పొల్పెసలారెడి కేసరాశిచే
నొప్పుల తావు లౌచుఁ గన § కోజ్వలభంగపిశంగ పత్త్రిముల్
ముప్పిరి గాఁగ నయ్యసన § పుష్పము లొందును సార్థ కాభిధల్
దప్పక భర్తృవిపత్రికృత § తన్వుల బింకము చిమ్ముఁ గల్గుటన్. 47

ఉ. బాలదివాకరాతపము § పర్విన పద్మము నీట నుండియున్
హాలను గ్రోలి నెఱ్ఱ నగు § నంగన నెమ్మొగ మింత పోలుచున్
జాలఁగఁ బ్రేయసీవదన § సంస్మరణ మ్మొలయించి యుత్సుక
త్వాలఘుచిత్తవృత్తినిల § యంబులఁ జేయదె యెంతవారినేన్. 48

ఉ. సస్యము నోమ నేర్పు గల § చాన యొకర్తుక లేళ్లనుండి యా
సస్యము గావ నేర్పు కర § సారస మెత్తకె పాడ గానసా
రస్య వశంవదమ్మయి కు § రంగము లిట్టటు చూడ కిందు బిం
బాస్య ముఖంబునే కనుచు § నట్టె నిలంబడె నాశ్వినంబునన్. 49

తే. కపత్రిపుటనంటి ననగుత్తి ƒ గంధ మెనసి
బంభరీగానవైభవ ƒ భరితము లయి
తెమ్మెరలు వీచి లోకత్రి ƒ యమ్ము నొంచు
కార్తిక మతంగజమ్ము రాƒకలను జాెె. 50
తే. యాదవులు గాంచి మోదింతు ƒ రబ్దరహిత
కాలమున దిక్కు లొఁబ లూడ్చు ƒ ఖడ్గము లని
నీరదావృత మా వేళ ƒ సౌరదంతి
చర్మనిర్మితకంచుక ƒ సహితము లని. 51
తే. తెమ్మెరలు చిమ్మఁ జెదరి క్రొంƒదమ్మియకరు
లందలి పరాగములు గ్రమ్మె ƒ నదిశ నెల్ల
హరివధూటులపై శరƒదంబుజాక్షి
నవ్వులాటకు నని చల్లె ƒ నా యనంగ. 52
తే. ఆకసమ్మునఁ దన విజƒయమ్ముఁ గోరి
సురలు పచ్చని యాకులు ƒ నెఱుపు చివురు
లమరఁ గట్టిన తోరణా ƒ లనఁగ నరుణ
ముఖశుకావళు లొసఁగెను ƒ ముదము హరికి. 53
తే. వికచబిసరుహనేత్ర మౌ ƒ విమలవారి
హంసహసితమ్ములఁ దనర్చు ƒ నాకసమ్ము
దీప్రశరదంతురము లైన ƒ దిఙ్ముఖములు
గల శరత్తును ముదితగా ƒ దలఁచెఁ జక్రి. 54

—: హేమంతర్తువర్ణనము :—

ఉ. ఏనుఁగు లోఁతు నీరు గల ƒ యేఱులనేని శిలామయంబుగా
మానక మార్పఁగాఁ గలసƒమర్థత గల్గిన శీతకాల జా
తానిల మార్తమైన పథిƒకాంబురుహాక్షుల యక్షులందు నే
ర్లౌ నటు లుష్ణబాష్పము లƒనారతమున్ గురియించు టబ్రమే. 55
మ. ఎలప్రాయమ్ముఁ గుచోష్ణతామహిమ లెంƒతేఁ గల్గు నిందీవరా
క్షుల వేసార్లు స్మరించు పాంథతతి కిƒచ్చో మంచుతో మించు గా
లులు ప్రాణాంతక మౌచు వీచుననఁ జెƒల్లుం బో వసంతాదివే
ళల వారల్ ప్రియలో స్మరింతురని పƒల్కన్ యుక్తమెట్లయ్యెడిన్.

ఉ. ఏచెలి యూరకే ప్రియునినెగ్గులు పట్టుచు వీడి యుండు మ
న్నా చెలి మార్గశీర్షమున నాప్రియునే దరహాసవక్త్రయై
యేచిన యాచలిన్ వణఁకుచెచ్చిన మచ్చికఁ గౌఁగిలించి గా
ఢాచితబాహుబంధము రవంత సడల్పద యొక్క లిప్తయున్. 57

ఉ. వాతెఱ మీఁదఁ గెంపువలె భాసిలు గంటు మఱుంగు సేయఁగా
నాతఱి నాతి కేమియు నుపాయము దోఁపఁగ నిల్చియున్ హిమా
సీతతవాయుపీడకు జనించినటుల్ ప్రకటించి సీత్కృతుల్
చాతురిఁ గప్పె దంతధవళద్యుతిచేలము చేతనంతలోన్. 58

తే. పతివలని కెంపుమోవి పైఁబంటిగంటి
మఱుఁగుపడ కున్కి బోటి హిమంబు చిలుకు
గాలి వణఁకుచు సీత్కార కలిత యగుచు
పలుకుదుటి తెల్ల డాలు దువ్వలువఁ గప్పె. 59

తే. మంచుకణములు జాల్గొను మారుతముల
కంప్రభుజలతాంగుళిఘటితతర్జ
నముల సహియింప రింతైన ప్రమద లాత్మ
విభుల పెనువక్షముల వీడు వేళలందు. 60

తే. స్మరభవం బయి సహజమై మహితమైన
ప్రేమచే సీతునను ప్రభవించు చెమట
ఊర వామోరు లాచలి కాఱ మేల
టంచు నెంచుచుఁ బ్రియుల మెప్పించి రెలమి. 61

—: శిశిరఋతువర్ణనము :—

ఆ. అల ప్రియంగులతల కలరుల దయచేసి
యాడు తేఁటి రొదయ హరికృతులను
శిశిర వాయువితతి చెలరేఁగి విరహిణీ
జనమునకును భయ మొసఁగె వనుల. 62

క. అరి వర్ధిలఁ గృశియించును
వరవితతిమఁ దయ్యెఁ గాల వశమున నెవఁడున్
గరమహిమము గోల్పడెరవి
గురుహిమ మెదిరింపఁ జాలకో మాఘమునన్. 63

ఉ. లొద్దుగపూ దుమారముల ౯ లు ప్తసుధారుచు లుల్లసిల్లుచున్
హద్దులు మీఱి సర్వహరి౯దంతములన్ విహరించు రాట్చమూ
పద్ధశితావనీ రజము ౯ భంగి నలుంగడఁ బెల్లు రేఁగి మే
ల్మద్దియలున్ బ్రియుల్ బెగడఁ ౯ బూవిలుదాలుపుదాఁడిఁ జాెఁెడున్.

ఉ. లాలితమత్కుచోష్ణతకు ౯ లభ్యఫలం బిఁకొకప్పు డబ్బునే
యేలొకొ? జాగటంచు మది ౯ నెంచుచు నల్కల నూడ్చి శీత మా
వేళ వినమ్రు లౌ పతులకు౯బిట్టుగ బాహులఁ గౌఁగిలించి యు
ద్వేలసుఖాఖ్యదుగ్ధజల౯ధిన్ మునుకల్ గొనుచుండ్రు కామినుల్. 65

తే. సతము సుమనోదశాధివా౯సమునె గోరు
నళిపతి లవంగలతఁ బొంద౯నరిగె తద్ర
జః ప్రసక్తి నొందె మలీమ౯సత్వ మనుచుఁ
గుందలత పూలచేతఁ బ౯క్కునను నవ్వె. 66

—* వ స ం త వ ర్ణ న ము *—

చ. సురభిశ్రీ పుష్ప గుచ్ఛ భర౯ శోభఁ దలిర్చుచు నమ్రభావమున్
సుర భరణీరుహంబు గనె ౯ నూత్న విజృంభణ వద్వసంతరా
డ్వర వరదుందుభి స్వనవి౯డంబిత కోకిలకాకలీ ధ్వనుల్
సురత విలాస లాలసతఁ ౯ జొక్కఁగఁ జేసెను గాముకావళిన్. 67

ఆ. అతివ నలముకొన్న ౯ నభిమాన మెడలించు
తీయమావిపువులఁ ౯ దేంట్లు వీడ
వల వసంతసౌధ ౯ మగు రసాలము దక్క
మనికి పట్టు గలదె ౯ మధుపతతికి. 68

ఆ. జగము లెల్ల గెలుచు ౯ సైన్యమధ్యంబున
జయకరంబు లని వ౯సంతలక్ష్మి
వర్ధమాన యగుచు ౯ బహుపటాంచిత కేతు
పటల మట్లు పె క్క౯రఁటుల నిలిపె. 69

ఆ. తనకు వశము కాని ౯ తనప్రియుఁ దనుఁ దానె
పట్టపగలె డాసెఁ ౯ బ్రమద యొకతె
తనకు వానిపైని ౯ దవిలిన ప్రేమ తే
తమము లగుచు నెగచి ౯ తపనుఁ గప్పె. 70

—* గ్రీష్మ ఋతువు *—

ఉత్సాహ:- వేసవిన్ జలంబు దోఁగ వితతహిమసుశీత మై
భాసమాన మౌచు మెఱపు పగిది నున్న మేనితో
వాసిఁ గాంచు మించుఁబోఁడి పజ్జ డాసి స్వాంతసీ
మాసనం బొసంగెఁ బ్రియుఁ డనంతముదము గల్గఁగన్. 71

—* వర్ష ఋతువు *—

తే. అబ్దజల మబ్బ నెమిలిపిం డాడఁ దొడఁగె
నదులు పొంగారె సాయంతనంపుదీప
మట్ల మెఱుపొ శిలీంధ్ర సుమాలయముల
నళిని యళిఁ గూడి క్రీడావిహార మూనె. 72

చ. ఘనమదమత్తబంభరనికాయము మూఁగిన కొండమల్లెపూ
లను జలవర్షణోన్ముఖ విలంబిత నీల వలాహకావళిన్
మన మలరంగ రైవతపుమౌళితలంబుల నిల్చి చూచుచున్
వనశిఖి బృంద మద్భుతరవంబులఁ బాడెడి సుద్గళంబులై. 73

—* శరదృతువు *—

తే. పొడవు లగు రెల్లుమొక్కల పొలుపు గన్న
శరదృతువునందు సంకోచ సరణి వీడి
మారసుఖముల నెదలోనఁ గోరు ప్రియుని
జేరి యలరెఁ జిరం బొక చిగురుఁబోఁడి. 74

తే. బెగ్గురులు బిట్టు రొద సేయు వేళ యగు శ
రత్తునఁ గుచద్వయంబున నత్తుకొన్న
చెమట బొట్లును హారమై చెలఁగి ప్రియుని
కరుచి నింపమి నంగన నదిమిపట్టె. 75

తే. కర్ణపేయంబుగా బలాకలు పొనర్చు
కాకురుతులకు నులికి యంగజుని బోలు
కాంతుఁ జేరి తనంత నేకాంతమందుఁ
గంతులీలకుఁ బూన దేకాంత ముందు? 76

—* హే మ ం త ము *—

తే. భావజోద్దీప కాసవ ౹ పానములను
మరులు నగవులు వర్ధిల్ల ౹ మగలఁ గొప్పు
వట్టి రతి కెలయించు జ ౹ వ్వనుల విడిచి
యెవఁడు కనుమోడ్చె హేమంత ౹ ఋతువునందు. 77

—* శి శి ర వ ర్ణ న ము *—

తే. చారులవలీవనావళి ౹ సంచరించు
తేఁటిగమి దివ్యమధు వాని ౹ నీటు మీఱ
సగము వికసించు పూరేకు ౹ చతురనాట్య
ములకు వెఱఁగంద మధురగీ ౹ తులను బాడు. 78

తే. కుజము లెల్ల నతంబులే ౹ కుసుమతతుల
మధురగానమ్ము వీడదు ౹ మధుపవితతి
సకల ఋతువులు వర్తిల్లు ౹ సానువులను
కృష్ణ! విహరింపవే యని ౹ కేకి పలుకు. 79

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
వసంతర్తువర్ణనము, గ్రీష్మర్తువర్ణనము, శరదృతు
వర్ణనము, హేమంతర్తువర్ణనము, శిశిరర్తువర్ణనము,
మఱల షడృతువర్ణనమ్ము నను షష్ఠాశ్వాసము
స మా ప్త ము.

—*—

క. వెడఁద యిఱి పిఱుందుల బరు
వెడపక తము నేచుచుండ ꠸ నింతుల యడుగుల్
గడు బడలి స్వరస మంతయు
నడుగడుగునఁ గ్రక్కు లాక్ష ꠸ యను వ్యాజమునన్. 6

సీ. గొనములచే గౌరి ꠸ కెన యైన యో చెలి!
నిను నిప్పుడే తెత్తు ꠸ ననుచు నీదు
ప్రియుని నమ్మించి నే ꠸ వెస నిట కరుదెంతు
నాపల్కు వితే సేయ ꠸ నయమె నీకు?
నీప్రతిజ్ఞ నడల్ప ꠸ నే నొక్కతెను గాక
నేర రెవ్వా రెప్డు ꠸ నిక్క మనెడు
వాసి గల్గను నాకు ꠸ వనితామణులలోన
నాకీర్తి కాపాడి ꠸ నన్నుఁ గావు

తే. నిన్ను నావెంట గొనకున్న ꠸ నీకు నాకు
మాటలే యుండ వని నియ꠸మంబు గొంటి
మనము మాటాడకొనకుంటఁ ꠸ గనిన యట్టి
మన విరోధుల కోర్కులీ ꠸ మాఱు పండు. 7

సీ. అందువల్లను ధైర్య ꠸ మడుగంటు నా కిఁక
నసువులే భారంబు ꠸ లగుచుఁ దుదకు
మేన నిల్వవు సుమ్మ ꠸ కానఁ గాంతుని మీఁద
గోరంత ప్రేమయుఁ ꠸ గుదురకున్న
నాప్రాణములమీఁద ꠸ నామీఁద దయ యుంచి
మనుపుమా నన్నని ꠸ మఱియుఁ బల్కు
ననుఁగుఁజెలిమికత్తె ꠸ యడుగుఁ దమ్ముల వ్రాల
దానిపై దయగల్గి꠸దానివలెను

తే. వల్లభుని నేరముల నెంచి ꠸ వనజనయన
పెద్ద కనుఁదమ్ములను గెంపు ꠸ పేర్మి గదురఁ
జెలియ పలుకులఁ గరఁగిన ꠸ చెన్ను దోఁప
నరుగు నద్దాని విడక వె꠸న్నాడి చనియె. 8

తే. వెన్కఁబడియుండ నెచ్చెలి వేగ మేగఁ
దగునె ముందటి కేఁగ నో మగలరాజ!
కుచనితంబభరమ్మునఁ గోమలాంగి
కడు వెతం బడు టీ వెఱుంగనిదె? చెపుమ! 9
తే. అని యొక వయస్య నిందింప నతివ వచ్చు
నందనుక నాఁగి యామె ముం దడుగు లిడుచు
నడచుచుండంగ వెన్క నాతఁడును మెల్ల
నడుచు నడుగులఁ బుడమిఁ గొల్చెడు ననంగ. 10
తే. వాఁడు నను వీడి యవమానపఱచినాఁడు
నా వెతకుఁ గుల్కుచుందువు; నీవు మెచ్చ
నతని పజ్జ కిదే యేన యరుగుదాన
ననుచు నల్కనుబలె నాడె నబల చెలికి. 11
క. పతిపజ్జ నడుచు యువతికి
నతులిత పులకాంకురాళి యలమిన కుచ మొం
దతని యెద దాఁకి వీడుచుఁ
బతనోత్థానముల వెలయు బంతిం బోలెన్. 12
సీ. చెలువ యో ర్థిపు డాపలి దెస సంగత
యై యుండ బహుళ రోమాంచితస్వ
సవ్యబాహువు సాచి సరగ నవ్వలి కుచం
బతఁడు పట్టఁగఁ దన యతుల మృదుల
దక్షిణేతరదోర్లతాహారమును మోహ
నాంగుని మెడ వైచి యవల సడల
కుండు రీతిని జుట్టి యొప్పుగా వేమాఱు
రవళించు మొలనూలు రాజిలంగఁ
తే. బ్రేయసుని జఘనంబుతో బిట్టు తాఁకు
స్వీయహారావళులు చాల జిక్కు వడఁగఁ
గుడికుచంబునఁ బ్రియు నెద గ్రుచ్చి గ్రుచ్చి
దక్షిణాంఘ్రి ప్రియాంఘ్రికి దవులుకతన. 13

తే. నాతిలోలంబుగాఁ జేసి § యవలి పాద
మందుఁ జిఱుమువ్వ మ్రోఁతలు § సందడింపఁ
గదలుపుచు భావజాతిరే§కమున మెల్ల
మెల్లగా మెట్టు భువి జగం § బెల్లఁ జూడ. 14

తే. సరయసుందరగమనుఁ డా § వరుని రెండు
మూఁపులం గరపల్లవ§ములను మోపి
గాటపుం గబ్బి చమమొనల్ § గాసి గూర్ప
నతని వెన్నంటి లీల మై § యతివ జనును. 15

ఆ. అలఘుపీవరోరు § వయ్యు గురునితంబ
భారవహనఖేద§భరిత యయ్యుఁ
బతిగళార్పితస్వ§బాహు వౌట భరింపఁ
జాలె హేలఁ బృథుల§జఘన యొకతె. 16

ఆ. వెలఁది వెనుక వచ్చి § విభుఁడు కక్ష్యంబులఁ
గరయుగంబుఁ జొనిపి § గబ్బిగుబ్బ
లంటి మోము ద్రిప్పి§నంతనె చుంబించి
నేల నున్న యొంటి§కాల నడపె. 17

తే. పచ్చి పారాణి రేకలు § పరఁగు కాల
దయిత దన్నిన బొమ్మ ము§ద్రలకు సంశ
యింపకె విభుండు సఖులలో § నెలమిఁ బోఁట
నాడుకొను చేడె కట్టెదు § రిట్టె చేరె. 18

తే. అలఘుశృంగార రసవాహి§నులు నతంబు
లైన నాభిహ్రదంబుల § నలమి నింపి
రోమరాజీ పరీవాహ§రూప మొంది
హంసకధ్వనితో నదు § లైరి చెలులు. 19

—* ఉపవనవర్ణనము *—

తే. హరివెలందులు విని రేటి§దరులయందు
మరుఁడు జనతామనంబుల § గుఱిగఁ జూచి
దివుచు పూవింటి గొనయంబు§రవళి యనఁగ
శ్రవణసుభగంబు లైన సా§రసరుతముల. 20

తే. అళికులంబులు దిరుగుచు నంబుజాక్షు
కమలనేత్రలవలె నుత్సుకతను బాడె
వనులు నవపల్లవ కరాగ్రవలనచలన
ముల నభినయించుఁ దద్భావములను గెరలి. 21

తే. అర విరియు మొగ్గలం జోరఁ దరము గాక
కలఁగి తేఁటులు చిమ్మ వికాస మొనయు
తరుల కేసరముల విప్పిఁ దద్రజంబు
వారిజాక్షుల కర్పించె మారుతంబు. 22

క. వనమారుతగతి తోడన
చన నేర్చిన తేంట్లగమి కెసంగెను వనితా
జననుతపరిమళ మున్నతిఁ
దనరు జనముఁ జేర సంపద లెదురగుఁ గదా! 23

క. హరితరుణులు నునుఁగేలన్
దర మిడి తాఁకంగ సౌమనస్యము గనుటన్
విరులకుఁ దదాది నామము
పరఁగెను "సుమనస్సు" లనఁగఁ బ్రథితార్థంబై

క. ఎదురేఁగి యదుముకొనఁగా
నద నెఱిఁగిన సతుల యగ్రహస్తంబుల బల్
చదురుల కోడెన్ మ్రోఁకుల
మ్రదిమాంచిత కిసలయములమండల మదిరా. 25

క. గల్లని మ్రోయఁగ వలయము
లుల్లసదళి యైన కొమ్మ నూఁపఁగఁ దరువున్
జల్లు మనఁ గురిసెఁ జెలి తల
పుల్లసుమచయంబు మోదముననో యనఁగన్. 26

క. అనవరతరసము రాగము
మొనయు తరుణపల్లవోద్గమము మదవతీ శా
త నఖక్షతి పరిచితిఁ గాం
చిన వాడె నదయముగఁ జెలిచే ఖండితమై. 27

—* పుష్పాపచయ వర్ణనము *—

చ. చెలువుని ముందటన్ నిలిచి చేడియ జాణతనంబు మీఱఁ బూ
వులకయి చేయి యెత్తి భుజమూలగతం బగు తన్నఖక్షతం
బులు బయలౌట కోసరిలి పొందుగ రెండవచేత నంబరాం
చలమునఁ గప్పెఁ జన్గవ వెసన్ బతి చూచినఁ జూడనట్లుగన్. 28

సీసమాలిక :-

తనతోనె విహరించు ధవుఁడు వనస్థలి
దాఁగి క్రమ్మఱ వచ్చి తరుణి యెదుటఁ
జనఁగ వానిని జూచియును జూడనివిధాన
మిఱ్ఱుపల్లంబుల మెఱయు వళుల
మెండైన తెల్పుతో మేలి నూఁగారు వి
లీన మై సన్న నై జాను గాంచ
తనుమధ్యమును దనుతరమగు నట్లుగా
నిగిడి విజృంభించి నెఱి మొగమ్ము
కనుదోయి నూర్ధ్వముఖమ్ముగా వెసఁ ద్రిప్పి
వలుద చన్గవ యెత్తుపల్ల మైన
యక్కునఁ గప్పఁగా హవణించు బల్పాలు
దిగజాఱ నుదరానఁ దేజరిల్లెడి
వలిపె మొకటి యున్న స్పష్ట మై గనఁబడు
నతనాభి తీరు విన్నాణ మొప్పఁ
దరుశాఖ పై నున్నతం బగు పూవులఁ
గోయు నెపంబునఁ గొంత సేపు
నాలసించుచునుండ నతఁడు కట్టెదుటనే
గలఁడంచు గూర్మి నెచ్చెలులు పల్కఁ
దెలియనటు నటించి యలరు గోయుట మాని
కడు తొట్రుపాటుల బెడఁగు చూపి
యన్ని తావులయందు నంశుకంబున్ను వేగ
సవరించుకొను చెల్వు చాలఁ జూపి
భయసంభ్రమములతో భావజు నానచేఁ
దమి హెచ్చఁ గిలికించితమ్ము నెఱపి

తే. చంద్రసఖ మైన నెమ్మోము చక్కవంచి
కొంత వ్యవధిని కోరెడు నింతిపతెను
బ్రియుని మన సెల్లఁ గరఁగించి పిన్న నగవు
చిలికెఁ జిఱునవ్వె గద! సౌమ్య చెలువ కెపుడు 29
సీ. తనిసిన చిగురాకులను లిఖించినఁ బలిం
పఁగ నసాధ్యమ్ము లై పరఁగు నివియు
కేవలమ్మును బులకించిన యంగక
మంద కూర్పఁగ నను మైనయవియుఁ
గ్రొవ్వాఁడిగోళ్ల నొక్కెడి యక్కరములుగా
బమ్మెర గొన వ్రాయఁబడిన వయ్యు
నారసినంతన యారశింపఁగ వ్యక్త
మగునట్టి యర్థము లమరునవియు
తే. నైన మన్మథలేఖ లేయాఁక లేక
యమ్మహీధరవనుల విహారకేళి
వశత యెసలారు యువతీయువకులచేతఁ
బ్రణిహితము లయ్యె నితరేతరమును బ్రీతి. 30
తే. లేని కిన్కను నటియించి చాన యోర్తు
నేరు పింతైన లేదని నేర మాడి
విడిచి నెచ్చెలిఁ గ్రొమ్ముడి విరులఁ దానె
తుఱుముకొనె బాహుమూలదీప్తులు నెలంగ. 31
సీ. అళికులంబులు మూఁగి యవనిజముల వీఁగి
నీమోము డాయఁగా నీవు పెదవి
విప్పి వారింపకు విప్పుచో మధుసార
ఖాంచిత భవదాననాబ్జసీమ
నవి గుత్త గొనును జుమ్మద్దిరా సరజస
సమరందజాతప్ర సవకుజముల
పైరక్తి మాని సుధారసంబును గ్రోల
భవదధరావాస్యపరత వచ్చు

తే. చున్నవే యని చెలి పల్క § నొక్క జాణ
కంటిఱెప్పల ద్విగుణించి § కన్నుగవను
మూసి మధుపాళికృతభయం§బునను బ్రియుని
యంకమున వ్రాలె సతికి భ§యమ్మె సొమ్ము. 32

ఆ. క్రొత్త పెండ్లియైన § కోమలి మోమెత్తి
ప్రియుఁడు బల్మి ముద్దు § వెట్టుకొనియెఁ
బూలఁ గోయు వ్యాజ§మున యెఱుఁగని యటు
యటు చరించె జాణ § యగు వయస్య. 33

తే. తీవగమిచేతఁ దన సప§త్ని మఱుఁగుపడ
ప్రియుఁడు ప్రియ డాసి బల్మి చుం§బించి మోవి
నొక్కవెత విదళించునిం§దుముఖి హస్త
వలయములధ్వని సవతివీ§నులకు సోఁకె. 34

ఆ. ప్రక్క నున్న మొక్క§పైఁ బ్రాఁకుఁ లేఁదీవ
ననుకరింపఁ గోరి § వనిత యొకతె
యాళు లెదుటఁ బ్రియున § కాలింగన మొసంగె
దోస మని తలంప§దు చపలతను. 35

తే. ఉవిద యున్నతతరువుపై § నున్న పూవు
గుత్తిఁ గోయఁగ నొక చేయి § యెత్తి యితర
హస్తమును బ్రియు మూపున § నాని. వాని
వెడఁద యురమును గప్పెఁ గొ§వ్విన చనుఁగవ. 36

తే. మృదుపదంబులు భువి నాను§చదురు లేదు
కుచభరంబును వహియించు§కొనను లేదు
చెట్టు పై పూవు గోయ నే§పట్టు లేదు
కానఁ బ్రియు నక్కునన్ వ్రాలెఁ § గలికి యొకతె. 37

తే. ఎత్తు గల కొమ్మ నున్న పూ§గుత్తిఁ గోరు
దాన నని పల్క బరిరంభ§తత్పరుఁ డయి
ప్రథితకుచభరఁ గౌఁగిటఁ § బట్టి పూవు
గోసి యిచ్చె నతండు దాఁ § గూర్మి పేర్మి. 38

క. ఇది తరు విదె పువ్వని పతి
ముదితను ముందటికి ముందు ఽ ముందున నడపున్
తుది కేశాంతముఁ జేర్చున్
మదనుని సాహసము తెన్నొ ఽ మనుజుల యెడలన్.

క. ఏవారు లేని తావని
తా వరు రప్పింప నన్య ఽ తరుణి గని యటన్
దా వెలిచి యవలఁ జనఁ బో
లావున నతఁడాఁపఁ దాఁ ద ఽ లంచెఁ గృతినిగా.

తే. "రేయి దానింటి కరుగవా? ఽ యీయ" నంచు
నతివ కోపించి పూదండ ఽ నంఘ్రియుగళ
మందు బంధింప నొకఁ డేని ఽ యడుగు గదలఁ
డేది భీతుల శక్తి హ ఽ రింప దరయ

సీసమాలిక.

తలిరాకు గాన్కగా ఽ దరిఁ జేరి యర్పింప
గూఢాపరాధి యా ఽ కూర్మివిభుని
నరసి త్వదీయమ ఽ హాదానముం గొను
యోగ్యత మాకడ ఽ నుండదె కద
యతిరహస్యస్థలి ఽ నధరమధువు ద్రావి
యాపద రక్షించు ఽ నయ్యాదుండ
బొమ్మ దానికె యిమ్మ ఽ పో యీవిటప మిప్పు
డందున సిద్ధించు ఽ నాత్మ సదృశ
పరతరయోగంబు ఽ పజ్జ నీతో నుండు
మఱి ధూర్త! నీదు దు ఽ శ్చరితములను
గ్రిమ్మ యత్నము వృధా ఽ కదె చెట్టుచివురుటు
పూవులు మాకర్ణ ఽ పూరము గనె

జను లెల్లఁ జెవులార § వినిన నీదుశ్చరి
త్రములు మాకర్ణరం§ధ్రముల నిండె
నెన్నఁడో యింతకు § మున్నె మాకికఁ గర్ణ
పూరచారుత లీల § బోఁ గదయ్య
దానింట నీవుండి § పూని యిచ్చటఁ బెద్ద
కలి నిల్పినాఁడవు § కాన నిప్ప
డిచట నీకలిక నిఁ§కేల నుంచెదవళి
కులములన్ ధ్వనియించు§కొనుచు నవ్వ

తే. ననుచు నిష్ఠుర మాడుచు § వినుతపక్ష్మ
కేసరమ్మును శ్రవణసం§కీర్ణము నగు
నల్లకలువనెకాదు కం§టను సయితము
కాంతు దయమాలి పరిహరించెఁ § గాంత యొర్తు. 42

తే. ఒకతె కంటిలోఁ బుప్పొడి§యొక్క రేణు
వొలికి యేచఁగఁ దత్ప్రియుం§డుప్పటంచు
నూఁది యోమఁగఁ జూచెడి § యొక సవతికిఁ
గిన్కఁ గావులె గ్రమ్మె న§క్షిద్వయమ్ము. 43

తే. తోడి మీనాక్షి దా పేరి§తోడఁ దన్నుఁ
బిలిచి నునుఁబూవు తన పయి § విభుఁడు విసర
నదియె యభిచారమంత్ర మై § యతివఁ గూల్చె
సతుల కభిచారమంత్రమే § సవతి పేరు. 44

ఆ. ప్రేమ నొక్క పూవు § ప్రియసి వీనున
భర్త యుంప దనదు § స్వర్ణభూష
ణముల నెల్ల నొక తృ§ణమ్ముగా నెంచియు
దాల్ప భార మనును § దాని సవతి. 45

తే. నీదు కను తీరులే గెల్పు § నాదు తీరు
ననుచు వనజాయతాక్షి వీ§నునకుఁ జేరి
వంగి యెలతేఁటిస్వనముతో § వాకొనునటు
చెలువ తీనున నల్లని § కలువ వ్రేలు. 46

తే. విరులఁ గోసిన తీవల § పేడి పూల
దండలు గట్టి లేమల § యందఁ జేరు
తుమ్మెదల దిమ్ము లటు లొఁ § డొంటిసాహ
చర్య మేలొకో? మలినాత్మ § చయముల కిల.

సీ. జాఱెడి క్రొమ్ముడి § భారంబునం బఱె
దిగు మూఁపు లొప్పఁగాఁ § దిరుగువారు
పొడవు దట్టము గల § భ్రూపక్ష్మభరముచే
నసఁ గనుమూయు నా § ననము వారు
మోము బల్మిని బట్టి § ముద్దాడఁ గుంకుమ
రేణువుల్ దొఁరగిన § యేని వేఁడి
వెలుఁగులగార ప్రతి § బింబింపఁ గాపులు
మొలకెత్తు చెక్కిళ్ల § వెలయువారు

తే. లలితకార్యము లొనరింప § నలయు వార
లతిలలితతరబాహుద్వ § యములవారు
తలిరిటాకుల ద్విగుణీకృ § తంబు లైన
విమలకాంతుల గరకమ § లముల వారు.

సీ. ఒండొరు కౌఁగిళ్ల § నుండ నంటిన పతి
యఱ్ఱు బల్పొఁతల § నడరు వారు
గురుఖేదమోదముల్ § గూడి నిల్చిన యట్టు
లెడ లేని చనుఁగవ § లెనయు వారు
కుచభారనతతను § రుచిర లయ్యును, దూర
గమనశ్రమానతాం § గములవారు
అలవాటు లేని ద § వ్వుల జన నలసిన
స్తవనీయగజకరో § రువులవారు

తే. అపుడ ఘటియించు పారాణి § యవని నడువ
శ్లిష్ట మైనను గ్రిమ్మర § లక్కరంగు
లొదవ నెట్టెటొ మెట్టుట § కోర్వలేని
చరణకంజాతయుగముల § జరుగువారు.

తే. ఇటుల నిహరించి విహరించి § యటవి నటవి
నుపరమించిరి ఘనజఘ§నోన్నత లట
మృదులతనువులు మఱియుఁ బ్ర§కృత్యలసలు
వనవిహారసమర్థులే § వారు జగతి. 50

తే. దీప్తగండస్థలముల ము§త్తెములఁ బోలి
యావలన్ జాఱి కఠినకు§చాగ్రదేశ
పాతములఁ జెందు శ్రమబిందు§పటలబృంద
ములు సహస్రికణంబు లై § చెలువు గాంచె. 51

తే. ప్రియుఁడు దరిఁ జేరి వెలఁదికి § విపుల మైన
పులక లొదవంగఁ జేయ వి§పులకమె యగు
సపరిమళముం బొనర్చిన § సౌరు విడదు
కుచయుగము మాత్ర మలయదు § గొనదు వికృతి. 52

ఉ. మానక పూలు గోయుచు శ్ర§మంపడి వల్లభు కంబుకంఠసం
ధాన మొనర్పఁగా భుజల§తల్తమకంబునఁజుట్టి యుజ్వలత్
పీనపయోధరద్వయిని § బ్రేయసు పేరుర మొప్పఁ గప్పి జా
నైన విధానఁ దాన పడి§నట్టి శ్రమంబును బాపె డంబుగన్. 53

చ. ముదిత యొకర్తు స్వప్రియుని § ముందట చెల్వుగ నిల్చుచున్ జగ
ద్విదితసమున్నతిం దనరు § స్వీయకుచద్వయ మంతకంతె నె
త్తు దనర మే న్నిగిడ్చి తన§దోర్లతలొంట నొకంతు నల్లుచున్
మది నుదయించు కోరికల § మాటికి మాటికినినే వెలార్చెడున్. 54

తే. మంచుకణములఁ బోలు చె§మ్మటకణముల
మఱియు మఱియుఁ బ్రయత్నించి § తఱి లభించి
నపుడు తుడుచును గ్రొత్త బెం§డ్లైన సతికి
బతికిఁ గుచకలశము లంటఁ § బదను నదియె. 55

సీ. ప్రాయంపు టింతులే § ప్రవహించు నదులై రి
స్వేదప్రవాహ మం§చితజలమ్ము
సరభసగతితోడి § జఘనసైకతముల
జరుగుచు మధ్యదే§శమ్ములాఁపఁ

దరువాలు నాభీహ్రాξదంబులం బూరించి
యూపెన్క నూరుభుξజాస్తము లయి
బాహులతలఁ గూడిξ పైబడి విహరించి
యుత్తుంగకుచపాళిξ నుఱికి యవల
తే. రోమకూపసహస్రముల్ξ రూఢి నింపి
యవల గండప్రదేశంబుξ లాక్రమించి
యచటనే నిల్చునట్లుండిξ యాగడించి
యందఱకు నేత్రపర్వంబుξ పొందు పఱచె. 56
ఉత్సాహ :- ఘననిదాఘబిందుతతికిఁξ గొంతుకరము దాఁకు నం
తనె మఱింత లై ప్రవాహξదర్పతన్ దెలంగఁ గా
వనవిహారజాతఖేదξపాత్ర లయ్యు నుజ్జ్వలత్
తనువిలాసవతులు స్నానξతత్పరేచ్ఛఁ గొల్వఁగాన్. 57

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
వనవిహారవర్ణనము, ఉపవనవర్ణనము, పుష్పాపచయ
వర్ణనము ననెడి సప్తమాశ్వాసము
సమాప్తము.

శ్రీ ర స్తు.

# శ్రీ మం దాం ధ్ర మా ఘ ము

[ శిశుపాలవధమహాకావ్యము. ]

## అష్టమాశ్వాసము.

—* జలక్రీడావర్ణనము *—

తే. మేటి కుచములతోడ ని మీలితాక్షి
పద్మములతోడ భూషణ పంక్తి మ్రోయు
ధ్వనులతో నేద భూమిపై పదము లిడుచు
నలసి చెలిపిండు చనె నెల్లో జలము కడకు. 1

తే. వంగియుంటను మూఁపులు పంక్తిగట్టి
యరుగు వనితల కెంత యంతరము లున్న
వెడలుపయి నొండొకంటిని బీడ సేయు
పిఱుఁదులకుఁ ద్రోవ లిఱు కయ్యె వెడలుపయ్యె. 2

ఉ. అంతరశూన్య భూజ శిశిరావనిసీమల సంచరించు నా
యింతుల ముట్టఁగా వెఱచియేమొకొ వేఁడి వెలుంగు గాలి నం
తంతఁ జలించు శాఖల దళాంతరవీథుల నుండి బంపి యా
వంత కరమ్ములన్ క్షణమె యంటక ముట్టనియట్ల యంపెడిన్. 3

చ. ముదిత నొకర్తు భానుకరముల్ గడు గాసిలఁ జేయ నాయెడన్
వదనసరోజ నిర్జిత విభాయుతుఁ డౌటఁ దుషారరశ్మి దాఁ
గదిసి సితాతపత్రితను గాంచి, తదాస్య దయావలంబమున్
హృదయమునందుఁ గోరి భజియింపఁగ వచ్చినవాఁడు నాఁదగెన్,

తే. అర్మిలిని దన యుత్తరీయముఁ బ్రియుండు
ప్రతిపద మ్మెండ సోఁకని గతిని మీఁదఁ
గప్ప ఛాయ యొకర్తె కధికతర మయ్యె
గొడుగు లూలిన లాఁకు లో కోమలకంటె. 5

చ. పరుస గరమున్ కరంబునను - బట్టిన నీరజపత్త్రినేత్రునన్
గరముఖము స్పర్శజం బగు సుఖంబు తనూలత నంటి పూర్తిగా
బరవశ మొందఁజేయుటయు - బల్మి దృఢంబుగఁ గట్టినట్టి యం
బరమునఁ గల్గు పోఁడిముడి - మాటికి మాటికి వీడిపోయెడున్. 6

ఉ. మందముగాఁగ నెన్నడల - మానవతుల్ పచరింప వారికిన్
జెందమునందు నచ్చెరువు - చెందిగొనంగను, గాంచి హంసికా
బృందము వీడె. స్వీయగతి - నెవ్వఁడునే నొరు చెంత నోటమిన్
బొంది వెలార్చునే స్వగుణ - మున్ మది సిగ్గిలకుండ నెయ్యెడన్. 7

తే. పెద్ద నయి విస్తరిల్లిన - పిఱుఁదు లొప్ప
సిరులు మించిన శ్రీకృష్ణ - చెలుల జఘన
ములకుఁ సమసైకతము లోఁద - జలధిరాణి
వాస[illegible] రాలఁ బడి వేగఁ - బాతెఁ గలఁగి, 8

తే. సలిలవేగాప్త శుక్తి - పేశులను విడిన
ముత్తెముల నంద మా నది - పులినములను
విడిన హారాళి రమ్య మౌ - స్వీయశయన
ములపై సరి యయ్యె నని యెంచెఁ - జెలుల గములు. 9

తే. శ్లాఘ్యగంధంబులును, శ్రమ - జంబులు నగు
స్త్రీల నిట్టూర్పుగాలులఁ జాల మూరు
కొని యళుల్ వన్యసుమములఁ గోర వార!
యౌచితి గణించునే విశేషాభిలాషి? 10

తే, అడవినుండి స్వకీయ జాయ చనుదేఁగఁ
గాంచి మఱియొక వెంటని - గానకుండఁ
బింఛమునఁ గప్పు నెమిలిని - వెలఁదు లరసి
నమ్మినా-రెందు మగవా - రోసనర్పు మాయ. 11

క. హరివనితల పలుకుల మా
ధురి కోటమి గనఁగఁ దమ రుతుల్ మదహంసో
త్కర మణఁగెఁ గలువగుంపులఁ
బరు నెదుటన్ నిలుచు నెవఁడు - పరుచే జితుఁడై.

ఆ. ముగుద చక్రవాకి ♦ మగఁడు నిశ్శంకగా
ముద్దు గొనఁగ నాత్మ♦భూలలితము
లందుఁ దగెడు సీత్కృ♦రాళి ప్రియుల ముందు
చేతు లొడ్డి చేసె ♦ నాతిపిండు. 13

తే. ఎత్తుగా విచ్చు దమ్ముల ♦ నెత్తి యర్ఘ్య
మును గనఁగఁ జేసి స్నేహానఁ ♦ బులుఁ గెలుఁగుల
నాడి, నురుగున వే నవ్వి ♦ యతివలకును
నూర్మిహస్తాలఁ బాద్యమ్ము ♦ లొసఁగె సరసి. 14

ఆ. తనదు కాణయాచి ♦ తమ్మినుండి సిరిని
బాణిపల్లవములఁ ♦ బైటఁ ద్రోసి
యపుడు కృష్ణ లలన ♦ లద్దానికి సపత్ను
లొటఁ దెలిపినారు ♦ దేటగాను. 15

—* జ ల ప్ర వే శ వ ర్ణ న ము *—

ఉ. ఎంతకు నెట్లయైన హృద♦యేశకరార్పిత నైజహస్తలై
కాంతలు లోనికిం జొరక ♦ కాతరతం గని నిల్చి యుండఁగా
నంతకు నక్కడన్ జలము ♦ లాతురతన్ త్వరితంబు వారిసం
క్రాంత సుబింబరూపమునఁ ♦ గల్గఁగఁ జేసెను లోఁ బ్రవేశమున్. 16

తే. కామినులు కాముల మనంబు ♦ కరణి జలముఁ
దొలుత వెఱచుచు గాథమ్ము ♦ తెలిసి యల్లఁ
బదము మోపి లోనికిఁ జొచ్చి ♦ పిదప రాగ
హృద్య మగు నంగములను రం♦జించి రెలమి. 17

తే. మాటికిని బెద్ద యేనుకుం♦భముల సిరులఁ
గాంచు చన్దోయి నీటిని ♦ గలఁచి మించఁ
జక్రవాకయుగంబులు ♦ జంట వీడె
నెవ్వఁ డుద్వృత్తుఁ డితరుల ♦ కిడును సుఖము? 18

ఆ. చలికిఁ దలఁకి కలికి ♦ సరసి యొడ్డునఁ గూరు
చుండు టరసి సవ్వ ♦ చునిద కరయు
గము విదల్చు విలస♦నముఁ గనువాంఛ మ
గండు నీట నిలిచి♦యుండి తడిపె. 19

తే. మసలవ పతితో సరసిఁ జొర మాని తీర
మందె నిల్చి సఖుల్ చల్లు నంబువులకు
బెగ్గడిలు చూపుల నవోఢ ప్రియుని గౌఁగి
లించెఁ దప్పొనె హద్దు మీఱిన యితమను. 20

తే. వరుఁడు మూఁపులు మునుఁగంగ వారి నిలువ
నంత దాఁకనె తనకు లోఁతగు నటంచు
సతివ తెలియక యట నిర్భయముస రాఁగఁ
బొదివెఁ బతి కౌఁగిటను "మునిఁగిపోవునా" యని 21

తే. నాభిదాఁకను గొలనిలో నాతి దిగఁగ
జలము చపలత నూర్మిహస్తముల గబ్బి
చన్నుఁగవ మీఁది కెక్కెఁ; స్పర్శంబు గన్న
వారి కెందేని యున్నె వ్యవస్థ యనుచు? 22

ఉ. "ఉవిదల మోముతమ్ములకు నోటమి నాకె యనంగరా దదే
కువలయ మోడెనే కనులకున్ ద్యుతిచే" ననుచున్ మనంబునన్
మిపులఁగ సంతసించుచును నీరరుహం బళిరావ గానమున్
దవిలి యొనర్చుచున్ బ్రచలితం బగు నూర్మ్ముల సల్పె నాట్యమున్,

చ. జలముల సంచరించెడి ఝషవ్రజ మూరువు రాయుటన్ భయం
బలమఁగ నూత్నవిభ్రమము లందపుఁ బెందొడ లున్న యింతికిన్
గలిగెను; జవ్వనంబు గల కాంతలకున్ దగుహేతు వుండకే
గలుగును విభ్రమంబు లవఁగా నిఁక హేతువె కల్గ నే మనన్? 24

తే కలఁగిపోయె సరో మహాజలధి జలము
తత్పురంధ్రుల యాకృష్టతనుత రాంగ
వల్లికల నీఁతలాడెడి బాహువక్ష
ముల సముత్తుంగ కుచ గండశిలలచేత, 25

తే. ఎంత గాంభీర్య మెనసిన నేమి కొలను?
యువతి జఘనవిఘట్టన మొందె విశద
జలజవక్త్రముతోఁ గ్రీడ సల్పుఁ గోరి
కలఁగి మర్యాద మీఱె నాక్షణమునందు. 26

తే. అకడన ముమ నాథుని § నరసి తెచ్చు
కొఱకుఁ బలె నలల గతిచేఁ § బఱుపఁ బడిన
వితత చలిత శిఖాంగుళీ § యుతము కేశ 27
హస్త మలరారె సిరు లొల్కి § చతివ కపుడు.

ఆ. విచ్చు ప్రియక కుసుమ§వితతుల సిరిఁ దాల్చి
పడఁతి మేను కొలన § బయలు వడియె
నమలతాంచితుల జ§లౌఘమ్ము లాక్రమిం 28
చినను బరిభవంబు § సేయ గలవె?

ఉ. దూరమునుండి దోఁచునది § తోయజమా యని శంకఁ జేసి కా
సారముచెంత కేఁగి యిది § చాన ముఖం బని నిశ్చయించె శృం
గారరసజ్ఞుఁ డొక్కఁ డల § కంజములన్ బకవాసభూములన్
చారువిలాస మేకడకొ § జాతి పరోక్షతఁ బూని యుండుటన్. 29

—* జలక్రీడా వర్ణనము *—

చ. ద్రుతకనకోజ్వలంబు లగు § తోయపు జంత్రములున్ సుగంధసం
గతమగునట్టి ద్రవ్యములు § గబ్బిచనుంగవకుండలంధు శో
ణితనుపటంబు లాసవము § నాధసమీపముఁ దోయకేళి కా
యత మయి యిట్లు సాధనము § లన్నియుఁ జేకుఱె యౌవతానకున్.

తే. ఉన్నత తటాంతమునఁ బతు § లుండి, భయము
కాంచ నవ్వారి యెదలతోఁ § గటిభరములు
మందగతి లేవ నీటను, § మరలఁ బడుదు 31
రతివమిన్నలు వాయుచ§లాంశుక లయి.

మ. మృగలవ్వేళ నొనర్చు ధౌర్త్యము గ్రహిం§పన్ లేని మౌగ్ధ్యంబునన్
మగువల్ గెల్వఁగలేకయున్ మరల నం§భఃపూరమున్ బాణులన్
దగఁ గైకొంచు నిజేశులన్ గదిపి మీఁ§దన్ జల్లుచున్ సంతతం 32
బుగఁ గ్రీడించి రొగిన్ నిజాభిసరణం§పుం బన్నిదం బొద్దుచున్.

చ. హరనయనాగ్ని దగ్ధ కుసు§మాయుధ సైనిక రాజ్యలక్ష్మి నే
త్రైఱఁ గాన యోగ్యమైన యొక § తీవియఁ బోణి ముఖేందుమూర్తికిన్
గర కలశోద్యతంబు లుద§కంబులు పెల్లునఁ బట్టి యెత్తుచున్ 33
సరసకళావిదుం డొకఁడు § సల్పెను దానె మహాభిషేకమున్.

చ. మదనకృతార్తి దుర్బలపు § మానిని యెట్టెటొ చేతు లెత్తి ప్రే
మ చనరఁగాఁ బ్రియున్ గదిసి § మజ్జన మార్చుచునుండు నంతలో
వదులయి తత్కరాగ్రమున § బాసిన కంకణ మొయ్యఁ జాఱె న
య్యదన లతాంగి మై మిగిలి§నట్టి మిటారపుఁ గాంతిలక్ష్మి నాన్. 34

చ. యువకునియందుఁ జూపుగమి § నొప్పుగ నిల్పి నిజానురాగమున్
వివరణ చేసి మారవశ § సీత హృదంతర యయ్యు వేఱ యొ
క్క వనిత నెచ్చెలిం దడుపు§కై తవముం గొని నాని ముందె రూ
పవు ప్రణయంబు నాఁగ జల§ మంజలి నిండ ఘటించి నెక్కొనెన్.

చ. ప్రియతమ హస్తతోయములఁ § బ్రేమ దలిర్పఁగ సిచ్యమాన మై
రయమున సంతసంబున గ§రం బొక శ్యామ మొగంబు దాల్ప; నా
యయమున కోర్వలేని యొక § యంబుజవక్త్రి ముఖంబు సిక్తమే
యయిన గురుశ్రమాంబువుల § నయ్యెను స్నానము చేసినట్లుగన్. 36

చ. తన పతిహస్తకుట్మలసృ§తం బయి పర్వెడు తోయధార చ
ట్టన పెఱపూవుఁబోఁడి నిబి§డ స్తనయుగ్మము సేచనం బొన
ర్చిన నది గాంచి యీర్ష్య గొని § చేడియ స్వీయవిశాలనేత్రసం
జనితమహాంబులన్ దడిపె § సారెకు నాత్మకుచద్వయిన్ రుషన్. 37

శా. ఏనీరంబులచేత నొక్క సరసుం § డిద్ధచ్ఛవుల్ మోమునం
బూనంజేసెనొ నింతి; కట్టవగు సం§పూర్ణేందు విద్యోత సం
ఘానూ నాచ్ఛతరాంచి తాంబువులు దూ§రాపాస్త మైనన్ సప
త్నీనారీమణి కొప్పెఁ దాఁ గలుషతన్ § జేకూర్పఁగా హేతు వై. 38

చ. పరమితానురాగమున § నాంధ్యము గన్న ప్రియుండు దా మన
శ్శపలతఁ జేరి మానవతి § సన్నిధిఁ దప్పుగు పేరు చెప్పి మో
ముపయిని జిమ్మువారిపవి § పుట్టువుచేతను మంద మయ్యు దే
హపతిత మై పగుల్ప హృద§యం బది దుస్సహ మయ్యె నింతికిన్.

ఉ. ప్రేమ దలిర్పగా బ్రియుఁడు § ప్రేయసి వక్షమునందు నూత్న నీ
రామలబిందువుల్ గురియ § నక్కడిన స్తనమండలాహతిన్
వేమఱు రాలు చాఁ పెమెయి§వేఁడిమి నొంది సమీపవర్తినిన్
భామిని నొక్కదానిఁ బయి§పాటున నొందఁగ జేసెఁ దావమున్. 40

తే. అంగనకు నంటు వరుని వక్షోంగరాగ
పటలి యిప్పుడు గడుగఁగాఁబడియె నీట
నంచు పొంగెడు సవతికి నధికతాప
మొదవఁ జేసెను స్ఫుటనఖపదము లకట, 41

చ. చెలులు వినంగఁ దన్నుఁ బెఱచేడియ పేరిడి కాముకుండు తొ
ట్రిలి పిలువన్ ముఖేందురుచి డింది యపత్రపఁ గ్రుంగఁ గాంచి య
క్కొ-లనునఁ గొమ్మ డాచుటకొకో యనఁగా వెస నావెలంది క
న్నుల జలవర్షముల్ వడిన నూనసమృద్ధి ఘటించె నీటికిన్. 42

ఉ. అన్ను మతోర్తు పైఁ బతి జలాంజలిఁ జల్లి క్షణంబు పిమ్మటన్
దన్ను జలాభిషిక్తఁగ నొనర్పఁగ నక్కట మోము కోపసం
పన్నతచేతనే నలుపువాఱెను నేత్రయుగంబునుండియున్
గ్రన్నన జాఱు కజ్జలజలంబులు తా మపశబ్దమై చనన్. 43

తే. స్వర్ణభూషోద్వహనశక్తిఁ బాసి భర్తృ
కల్పిత మృణాళ సూత్ర కంకణము దాల్చి
కృత సపత్నీకటాక్ష సంగతభర మయి
గురుతరం బయి పెంపొందెఁ దరుణి భుజము. 44

తే. మిన్న లగు పెక్కు చిఱుగంట లున్న నేమి
సతతజలగాహమునఁ దేలు సతుల మేఖ
లాకలాపము ధ్వని లేక మూఁక మయ్యె
జడగుణాప్తుల కబ్బునే నుడులతీరు? 46

ఉ. ఎంతయు స్వచ్ఛమౌ కొలన నింతి పయోహృతచేల గాఁగ న
త్యంతము చూపు నిల్పి మదనాహవదేశికుఁడౌ ప్రియుండు ద
న్నంతటఁ జూచె నంచు బిడియంపడఁ బద్మిని వీచిహస్త సం
క్రాంత దళాంబరంబునఁ బురంధ్రిని గప్పె వెనన్ వయస్య యై.

చ. గురు జఘనస్థలాహతులకున్ గుఱిసేసి ముఖద్యుతిన్ వికా
స్వరకమలాళి గెల్చి చెలువల్ తనుఁ గిన్పుఱుపన్ జలాశయం
బెరియుచు లోలబుద్ధి త్యజియింపఁగలేక తదంగరాగముల్
సరగ హరించెఁ గాని కలుషం బయి గోచరమయ్యెఁ దాఁ దుదిన్.

కం. వనితల సౌగంధ్యము గని
యును-దవ్వయి తన్ముఖముల కుపమానం బై
తిని; జేరువ యయి యోడితి
నని కమలము కదలునీటి యందు మునింగెన్. 48

తే. విచ్చు గురివెందపూలట్ల పచ్చ నైన
వనితల పసిండి నగలు సత్వర వగాహ
సలిలకేళుల జాతి యక్కొలన బాడ
బానల ద్యుతిఖండమ్ము లట్ల మెఱసె. 49

క. యువతుల చూడ్కుల కనపా
యి విభాపాదకము లయ్యె నిదె యాస్మాక
చ్ఛవు లని స్వగుణముఁ గప్పిన
రవరవ నునుఁగాటుకలఁ గరంచె జలంబుల్. 50

క. హరిచందన మంబురుహల
గరఁగఁగ నాపాండు పైన కలికి చనుఁగవన్
దొఱఁగి పరభాగ మెడయుట
సరగఁ దెగియె హారయష్టి సహృదయ కాదే. 51

తే. అధిక మౌ నమృతగుణంబు నధిగమించి
దళిత విస్ఫురితాబ్జావతంస యయి ప్రి
యోపభోగ్యంబు నగు సురయును సరసియుఁ
గామినుల దృక్కులందు రాగము ఘటించె. 52

ఉ. చెన్నయి నిర్మలోదకణచిత్రము లై జలకంబు లాడు న
య్యన్నుల చన్నుఁగుండల లలరారెను గేళిరయాన సూత్రముల్
ఛిన్నము గాఁగ సద్గుణవిశిష్టసమాశ్రయవాంఛచేఁ దమున్
గ్రన్ననఁ జేరు హారమణిరాజికి నాశ్రయ మయ్యెనో యనన్. 53

తే. పడఁతుల చెవులయందుండి పడిన నల్ల
కలువలను నొడ్డునకు గెంటె నలలగములు
ఉన్నతిని గాంచి, పతితుఁడై యున్న నాత్మ
భవుని నేని స్వచ్ఛాత్మలు పరిహరింత్రు. 54

తే. అంగమున లేపనము వో నx ఖాంకములును
అధరమున లాక్ష వో రదx నాంకములును
జానలకు శ్రీలనే నింపె x సలిలకేళి
సిరులె కూర్తుగదా సదాx శ్రితు లెడరున. 55

చ. సలిల భరావలంబులుఁ బిx శంగిత కేసర పూరితాంతరం
బులు నయి వ్రాలు ముంగురులఁ x బొల్పగు వల్లరు లుల్లసిల్లుచున్
గలికి ముఖంబునన్ మకరిx కాముఖప త్త్రలిపుల్ జలాహతిన్
దొలఁగిన లోపమున్ దొలఁగఁ x ద్రోచె ఘటించిన చిత్రశోభచే. 56

తే. సరసి జలములు యదువుల x యురములందు
దట్టమౌ నంగరాగమున్ x దలల విరులఁ
గొనిన; మద రాగ మది మాత్ర x కనుల విడద
ఘనులచక్షుష్య ధర్షింపఁ x గలరె యొరులు? 57

తే. వారి వెలుపటి రాగమే x వాసెఁ గాని
వారి మనముల రాగంబు x వాయ దాయె
ధీరులగు వారి నడుమను x జేరు నెవఁడుఁ
బరిభవ మటంచుఁ బొందు నే x పరులవలన. 58

తే. రమ్యకుచముల ఫేనహాx రములు జఘన
సీమలందున శైవాలx చేలములును
జెక్కులను నాకుదీవల x చిత్రరచన
లమరె జలముల సొమ్ములై x యతివలకును. 59

తే. గురుతరాలంకృతులు స్త్రీల x వరతనువులఁ
బాసి నీటను సిగ్గుచేఁx బలె మునింగెఁ
డోన నిర్మాల్యము నటింపఁ x బూనె నీట
నల్పుఁ డభిభూతుఁ డయ్యు దాx ర్ఢ్యమునె చాటు. 60

తే. బొట్టుసిరు లేఁగిపోయెను x బూలదండ
లంబరము కావులను బాసె x నంగరాగ
మరిగె స్వబలంబు వోయిన x యార్తినిబలెఁ
జారుతరరూపలుగఁ జేసె x స్మరుఁడు స్త్రీల. 61

తే. అంబుసేచన జాత శీ§తార్తినిబలె
శీతపవన కంపిత షౌచు§నూతనాంశు
కమ్ము నవయౌవనోష్మక§ర్కశము లైన
కామినీ కుచతటములఁ§గౌఁగిలించె. 62

తే. అంగముల నంటఁ దమ్మంటి§నట్టి లవణి
మంబు రూపొందినట్టుల§యంబు లురల
నలలపై నాడ నేర్చిన§వలువకొంగు
లడరఁ జెలిపిండు ప్రియులతో§వెడలె సరసి. 63

తే. వేల్పులకుఁ గూడ వింతను§గొల్పఁ జాలి
భాసమానాంబురుహ చారు§పాణి యగుచు
సరసి వెడలెడుచెలి లచ్చి§సరణి నెదుటఁ
జూచి కృష్ణుఁడు కడలిఁ ద్రచ్చుట స్మరించె. 64

తే. తమ్ముఁ గప్పంగ ధరియించు§తనుత రాంబ
రము జలాసక్తమై యంట§రమణుల వగు
విమలతర పీవ రోరుయు§గములు స్వీయ
కాంతులను జిమ్మి లో దాఁచి§కప్పె నంట! 65

తే. చెలులు గట్టిన వలువలు§తెలిమొగుళుల
సిరులుఁ గొని మోదమున నవ్వ§కరణి మెఱసె
వారు విడిచిన నీరోడు§చీరలు వగఁ
గన్నునీరోడ రోదించు§కరణి నెఱసె, 66

తే. సరసతను దద్ద సంసక్తి§నెఱపి యుంటఁ
బలుమఱును బెట్టు ద్రోపులు§వడియుఁ బడియు,
నూత్నరక్తకతతి వెలం§దుకల యంగ
కముల విశ్లేష మెట్టెటో§కాందఁ గలిగె. 67

తే. పెన్నెఱుల్ మూఁపునం బడ§వెలఁది యొకతె
తాన మొనరించి యంగమ్ము§తడిని నార్చెఁ
బెద్దతడవున కెట్టెటో§ప్రియు నెదుటను
నరయఁ బెంపొందు శ్రమ వారి§నెఱుఁగ కట్టె. 68

